మే 1973

44

రాష్ట్ర విభజనోద్యమం - మార్క్సిజం

కె. ప్రసాదరావు




మేడే ప్రత్యేక సంచిక

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

నిర్వహణ

'సాహితీ మిత్రులు'

1 రు.

ఈ మేడే సంచిక పీడిత ప్రజానీకం విముక్తికి అంకితమైన కార్మిక, రైతాంగ సాయుధ విప్లవ మైత్రికి అంకితం.

మేడే ఉత్సవం వేలాది సమరయోధులను మన వైపుకు ఆకర్షించి సమస్త ప్రజల స్వేచ్ఛకోసం పెట్టుబడి దాస్యంనుండి సకల శ్రమజీవుల విముక్తి కోసం జరిగే మహాసమరంలో మన శక్తులను బ్రహ్మాండంగా పెంపొందించుగాక !

—

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

మేడే ప్రత్యేక సంచిక

మాసపత్రిక

44

మే 1973

నిర్వాహణ
'సాహితీ మిత్రులు'

92 పేజీలు

1 రూపాయి

విడిప్రతి: ఒక రూపాయి
అర్ధసంవత్సర చందా: ఆరు రూపాయలు
సంవత్సర చందా: పది రూపాయలు

ప్రతులకు. వివరాలకు :

సృజన
హనుమకొండ
వరంగల్ - 506001

SṚJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh Hyderabad. Vide Ref. No. 182/A4/67, dated 22-9-1967.

Edited and Published by Varavararao for 'Sahithee Mithrulu'
Printed at Venkataramana Mudranalayam,
J P. N. Road, Warangal-506002 (A.P.)

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

1973 మే — మాసపత్రిక 44

ప్రపంచ కార్మికులారా
ఏకంకండి !

పోరాటంలో మనకు పోయేవేమీలేవు
సంకెళ్ళు తప్ప !!

# మే డే

సోదర కార్మికులారా! ప్రపంచ కార్మికుల గొప్ప పండగ దినం సమీపిస్తోంది. వారు సూర్యకాంతికి మేల్కొని జ్ఞాన మార్జించినందుకు సంతోష చిహ్నంగా మే ఒకటవ తేదీని పండగ చేసుకుంటారు. సమస్త పీడనకు వ్యతిరేకంగా, సమస్త నిరంకుశత్వానికి వ్యతిరేకంగా, సమస్త దోపిడీకి వ్యతిరేకంగా సోషలిస్టు సమాజ స్థాపనకై పోరాడేందుకు ఒక సోదర బృందంగా ఐక్యమయినందుకు వారు ఆనాడు ఉత్సవం జరుపుకుంటారు. కష్టించి పనిచేసే వారందరూ తమ కష్టంతో ధనికుల-సామంతుల కడుపులు నింపే వారందరూ, స్వల్ప జీతాలకు నడుములు విరిగేటట్లు యావజ్జీవితం శ్రమించే వారందరూ, తమ శ్రమ ఫలితాల్ని ఎన్నడూ అనుభవించనివారంతా, నేటి నాగరికత ప్రసాదించిన విలాసాల-భోగభాగ్యాలమధ్య బ్రతుకు భారంగా పశుజీవితం గడిపే వారంతా- ఆ రోజున కార్మికుల విముక్తికోసం, కార్మికుల సౌఖ్యంకోసం పోరాడ్డానికి ఒకరి చేతులొకరు అందుకుంటారు. భిన్నజాతులకు, లేదా మతాలకు చెందిన కార్మికులమధ్య వైరం సమసిపోవాలి. కార్మికుల అజ్ఞానం మీద, అనైక్యతమీద బ్రతికే దోపిడీగాండ్రకు, నిరంకుశ పాలకులకు మాత్రమే యీ వైరం ప్రయోజనకారి. హిందువులు, ముస్లింలు, బౌద్ధులు, జైనులు, యూదులూ-క్రైస్తవులూ, ఆర్మీనియన్లూ-టాటార్లూ, పోలులూ-రష్యన్లూ, ఫిన్నులూ-స్వీడులు, లెట్టులూ-జర్మన్లూ- అందరూ, వీరందరూ సోషలిజం అనే పతాకం క్రింద కదం తొక్కుతూ కలిసి నడుస్తారు. కార్మికులందరూ సోదరులు; వారి దృఢ ఐక్యత మాత్రమే శ్రమజీవులందరి, పీడిత జనులందరి సంక్షేమానికి, సౌఖ్యానికి హామీ. మే మొదటి తేదీని సకల దేశాల కార్మిక సమాఖ్య, అంతర్జాతీయ శ్రామిక ఉద్యమం తన బలాలను బేరీజు వేసుకొంటుంది; స్వాతంత్ర్యం, సమానత్వం సోదరత్వం కొరకు మరింత నిర్విరామంగా మరింత దృఢ నిశ్చయంతో పోరాడ్డానికి తన శక్తినంతనూ సమీకరించుకొంటుంది.

— లెనిన్

# రాష్ట్ర విభజనోద్యమం - మార్క్సిజం

కె. ప్రసాదరావు

గత అయిదారు మాసాలుగా ఆంధ్రప్రాంత మంతటా రాష్ట్ర విభజనకోసం ఇదివరకెన్నడూలేని స్థాయిలో ఉద్యమం కొనసాగుతోంది. ఆ ఉద్యమాన్ని అణచి వేయడానికి కేంద్ర ప్రభుత్వం వేల సంఖ్యలో సి. ఆర్. పి. సీ. సైన్యాన్ని తరలించింది. ఆంధ్ర పట్టణాలన్నీ దాదాపు సైనిక శిబిరంగా మారాయంటే అతిశయోక్తి కాదేమో. లాఠీచార్జీలు, రోజులకొలది కర్ఫ్యూలు ప్రకటించడం, కదిలితే మెదిలితే తుపాకి కాల్పులు సర్వసాధారణమైనాయి. 1969 లో జరిగిన ప్రత్యేక తెలంగాణా వుద్యమానికి చెన్నారెడ్డివర్గం ద్రోహంచేసినట్టే, ఇప్పుడు ఆంధ్రలో కూడ కాంగ్రెసు నాయకత్వం ఆచరణలో పోరాటానికి వెన్నుపోటుపొడవడం మూలంగా తాత్కాలికంగా ఆ వుద్యమం నీరసించినట్లు కనిపిస్తున్నా, మొత్తం ఆంధ్ర ప్రజానీక మంతటిలోనూ కాంగ్రెసు ప్రభుత్వంపట్ల తీవ్రమయినద్వేషాగ్ని ప్రజ్వరిల్లుతోంది. ప్రజలు సి.ఆర్. పి. సీ. సైన్యాన్ని ఎదుర్కొని పోరాడారు. శాంతియుత పద్ధతులకు వుద్యమాన్ని కుదించాలని కాంగ్రెసు నాయకులుచేసిన ప్రయత్నాల్ని ఎవరూ ఖాతరుచేయలేదు. బారికేడ్సు కట్టడం, సోడాబాటిల్సుతో బాహాబాహీ పోరాడడం, నాటుబాంబులు ప్రయోగించడం మొదలయిన పోరాటరూపాలు ఆంధ్ర పట్టణాలలో మొట్టమొదటిసారిగా అమలులోకి వచ్చాయి. అంతేకాదు ఆ రూపాలు యీనాడు సర్వసాధారణమైనాయి కూడ.

ఈ పోరాటానికి నిరుద్యోగంతో బాధపడుతున్న విద్యార్థులు, యువకులు, అధిక ధరలతో, చాలీచాలని జీతాలతో చావలేక బతుకుతున్న మధ్యతరగతివారూ ప్రాణం. ఆంధ్రప్రదేశ్ మొత్తం ప్రజానీకం అంతా యీ పోరాటానికి మద్దతుగావుంది. ఈ పోరాటానికి వ్యతిరేకంగా గజ్జకట్టి నిలబడింది కేంద్ర ప్రభుత్వమూ, కమ్యూనిస్టుపార్టీ పేరుతో చలామణిలోవున్న సి. పి. ఐ. కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) లు. తనకున్న అధికారబలాన్నీ, మిలిటరీబలాన్నీ కేంద్రీకరించి ప్రజావాంఛను నిర్దాక్షిణ్యంగా అణచి వేయడానికి ఇందిరాగాంధీ సిద్ధపడితే, అది అసలు ప్రజాపోరాటమే కాదనీ, కేవలం కొద్దిమంది బూర్జువా భూస్వాములు మొదలయిన ప్రజాద్రోహులు కొనసాగిస్తున్న విచ్ఛిన్న చర్యలు మాత్రమేననీ, రాష్ట్రాన్ని విభజించడం జాతిపట్ల తీరని అపచారమే గాకుండా, మార్క్సిజానికి కూడ పూర్తి వ్యతిరేకమనీ సి. పి. ఐ, మార్క్సిస్టు పార్టీ

వారు తీవ్రతరంగా ప్రచారంచేస్తూ, తమ అనుచరుల్ని ఈ పోరాటానికి వ్యతిరేకంగ సమీకరించడానికీ, తద్వారా ఈ పోరాటాన్ని వెన్నుపోటుపొడవడానికీ పడరానిపాట్లన్నీ పడుతున్నారు. పైగా ఎట్టి పరిస్థితిలోనూ ఈ పోరాటంయొక్క ఒత్తిడికి లొంగిపోరాదని సి. పి. ఐ. వారు ఇందిరాగాంధీని హెచ్చరిస్తూ తీర్మానాలుకూడ చేస్తున్నారు. ఈ పోరాటాన్ని వ్యతిరేకిస్తూ ఇందిరాగాంధి చెపుతున్న కారణాలు చాలపేలవమైనవి. అందుకు జవాబులు అనేక రూపాల్లో చాలమంది ఇదివరకే రాశారు. "కమ్యూనిస్టు పార్టీవారు" ఈ పోరాటానికి వ్యతిరేకంగా పీడితప్రజల్ని సమీకరించడానికీ, మార్క్సిజం పట్ల అభిమానంవున్నవారిలో గందరగోళం లేపడానికీ ఈ కింది వాదనలచేస్తున్నారు. ఈ వ్యాసంలో ప్రత్యేకించి ఈ వాదనలకు మాత్రమే జవాబు రాయడానికి ప్రయత్నిస్తున్నాను.

ఈ సందర్భంలో జనరల్‌గా మార్క్సిస్టులమనుకునే వారిమధ్య వినిపిస్తున్న వాదనలివి- (1) ఇది బూర్జువా, భూస్వామ్యవర్గాలు కొనసాగిస్తున్న వుద్యమం కాబట్టి దీనికి మద్దతు యివ్వరాదు. (2) ఇలాంటి వుద్యమాలు దేశంలో కొనసాగుతున్న వ్యవసాయ విప్లవాన్ని పక్కదారి పట్టిస్తాయి కాబట్టి వ్యతిరేకించాలి. (3) మార్క్సిజం ఒకజాతి సమైక్యతను బలపరుస్తుంది కాని విచ్ఛిన్నతను బలపర్చదు. అలా బలపర్చడం మార్క్సిజానికి వ్యతిరేకం. (4) ఈ పోరాటాన్ని రెండు జాతులమధ్య పోరాటంగా ఎందుకు భావించరాదు ?

పై వాదనల్లో ఒకటి, మూడు వాదనలు కమ్యూనిజం, మార్క్సిజం పేరుతో ఈ వుద్యమాన్ని వ్యతిరేకించడంలో సి. పి. ఐ. కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు)లు కలిసిచేసేవే. రెండోవాదాన్ని "మార్క్సిస్టు"లతోపాటు మావో ఆలోచనా విధానాన్ని ఆమోదిస్తున్నామని చెప్పుకునే మరికొంతమందికూడ కొనసాగిస్తున్నారు. నాల్గవ వాదం ఈ పోరాటాన్ని సమర్థించడానికి సిద్ధమయిన కొంతమంది కమ్యూనిస్టు అభిమానుల్లో నుంచి వస్తోంది. మొత్తంమీద మార్క్సిజం పేరుతో తరతమ స్థాయిలో పై నాలుగు వాదనలు కొనసాగుతున్నాయి. ఒక్కొక్కవాదాన్నే పరిశీలించుదాం.

మొదటివాదం- ఇది బూర్జువా, భూస్వాముల వుద్యమంకాదా అనేది. తప్పకుండా సారాంశంలో ఇది బూర్జువా వుద్యమమే. ఇదే కాదు ప్రపంచమంతటా జరిగే జాతుల వుద్యమాలన్నీకూడ బూర్జువా వుద్యమాలే. ఫ్యూడలిజం నిర్మూలింపబడి పెట్టుబడిదారీ విధానం అభివృద్ధిజెందే క్రమంలో అంతవరకు స్వయంపోషక ఆర్థిక విధానంతో విడివిడిగా బతుకుతున్న ప్రజల్ని పెట్టుబడిదారీ ఆర్థికవిధానమే సమైక్యం

చేస్తుంది. అభివృద్ధిచెందుతున్న పెట్టుబడిదారీ విధానానికి అత్యవసరమయిన విష యాల్లో మార్కెటు ఒకటి. అలాంటి స్థిరమయిన మార్కెటును సృష్టించుకునే లక్ష్యంలో భాగంగానే పెట్టుబడిదార్లు తమ అవసరంకొద్దీ ప్రజల్లో జాతీయభావాన్ని పెంపొందింపజేస్తారు. స్వయంపోషక ఆర్థికవిధానం నశించి, మార్కెటుతో విడదీయ రాని సంబంధాన్ని కలిగించే సరుకుల వుత్పత్తి విధానం ఆరంభమయిన తర్వాత ఒకే భూభాగంలో నివసిస్తూ, ఒకేభాష మాట్లాడుతున్న ప్రజలు ఒక జాతిగా సమైక్యమవు తారు. క్రమంగా వారిలో ఒకేవిధమయిన మానసిక తత్వంకూడ అభివృద్ధిచెందుతుంది. ఆ విధంగా స్వయం సంపూర్ణమయిన జాతిగా ఆ ప్రజలు రూపొందుతారు. అయితే ఈ క్రమమంతా చరిత్రలో ఎక్కడా సాఫీగా జరిగిపోలేదు. ఇకముందు అలా జరగ బోదుకూడ. పెట్టుబడిదారీ విధానాభివృద్ధికి ఆటంకంగావున్న ఫ్యూడలిజంతో జరిగిన తీవ్రతర పోరాటంలో భాగంగానే ఆ పరిణామం జరిగింది. అలాంటి వుద్యమాలన్ని టికీ మొదట్లో పెట్టుబడిదార్లే నాయకత్వం వహిస్తారు.

ఆయా దేశాల్లో సాంఘిక ఆర్థిక పరిస్థితులకు అనుగుణ్యంగా జాతుల సమస్య అనేక రూపాల్లో బహిర్గతం కావచ్చు. ఏ రూపాల్లో బహిర్గతమయినా ప్రధానంగా అది విభిన్నజాతులకు చెందిన బూర్జువావర్గాల మధ్యగల వైరుధ్యమే. అయితే ఆ వైరు ధ్యాన్ని తమకనుకూలంగా పరిష్కరించుకునే ప్రయత్నంలో తమవెనుక ప్రజలందరినీ సమీకరించుకోడానికిగాను జాతినంతటినీ రకరకాల నినాదాలతో ఉత్తేజపరచడానికి పెట్టు బడిదారులు ప్రయత్నిస్తారు. కొన్ని సందర్భాల్లో జాతిమొత్తంగా ఆ నినాదాల వెనుక సమీకృతమవుతుంది కూడ. అలాంటి సందర్భాల్లో కార్మికవర్గం తనకేమీపట్టనట్టూ, సంబంధం లేనట్టూ వ్యవహరించజాలదు. ఈ విషయాన్నంతటినీ క్రోడీకరించి మార్క్సిస్టు మహోపాధ్యాయుడు కామేడ్ స్టాలిన్ ఇలా రాశారు.

"పెట్టుబడిదారీ విధానం అభివృద్ధిచెందుతూవున్న పరిస్థితుల్లో జాతుల సమస్యపై జరిగే పోరాటం బూర్జువావర్గాలమధ్య జరిగే పోరాటమే. కొన్ని సందర్భాల్లో జాతుల వుద్యమంలోకి కార్మికవర్గాన్ని కూడ బూర్జువావర్గం ఆకర్షించగలుతుంది. అలాంట ప్పుడు పైకి "జాతిమొత్తం" యొక్క పోరాటంగా అది వ్యక్తమవుతుంది. కాని వాస్త వానికి అది బయటికి కనిపించే లక్షణం మాత్రమే. సారాంశంలో అది ఎప్పుడూ బూర్జువా పోరాటమే. ప్రధానంగా బూర్జువాజీ ప్రయోజనాల కొరకు జరిగే పోరాటమే."

"అయితే కొన్ని జాతులు అణగదొక్కబడడానికి వ్యతిరేకంగా కార్మికవర్గం ఏ విధంగానూ పోరాడరాదని దీనర్థం కాదు."

"ఉద్యమం యొక్క స్వాతంత్ర్యాన్ని అరికట్టడం, వోటింగు హక్కును పరిమితం చేయడం, భాషాభివృద్ధి నరికట్టడం, పాఠశాలలను మూసివేయడం, అలానే ఒక జాతియొక్క అభివృద్ధిని అరికట్టే తదితర చర్యలకు పూనుకోడం, మూలంగా బూర్జువా వర్గానికెంత నష్టం వాటిల్లుతుందో, దాదాపు కార్మికవర్గం పొందే నష్టంకూడ అంతకంటే తక్కువేమీ కాదు. అలాంటి పరిస్థితులు అణగదొక్కబడుతున్న జాతికి చెందిన కార్మికవర్గం యొక్క మేధావి శక్తుల స్వతంత్రాభివృద్ధిని అరికట్టడానికి మాత్రమే ఉపకరిస్తాయి."

కామ్రేడ్ స్టాలిన్ రాసిన పై విషయాన్నిబట్టి ప్యూడలిజం బలంగావుండి అనేక జాతులతో కూడిన రాజ్యంగావున్న దేశంలో జరిగే సామాజిక విప్లవంలో జాతుల సమస్యకూడ పెనవేసికొని వుంటుందని అర్ధమవుతుంది. అలాంటప్పుడు ఆ సమస్య నిర్దిష్టమయిన పోరాటరూపం తీసికునే పక్షంలో ఆనాడుదేశంలో కొనసాగుతున్న సామాజిక విప్లవానికిగానీ, ప్రపంచ కార్మిక విప్లవానికిగాని, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఎంతో కొంత నష్టాన్ని కలిగించే ప్రత్యేక పరిస్థితుల్లో తప్ప సర్వసాధారణంగా కార్మిక వర్గం తప్పకుండా అలాంటి పోరాటాలకు మద్దతు నివ్వాలి; ఇస్తుందికూడ. ప్రజాస్వామిక విప్లవాల్లో భాగంగానూ, ఆ విప్లవాలతో పెనవేసికొనీ అవి కొనసాగుతూ వుండడమే అందుకు కారణం

ఈ విషయాన్నే కామ్రేడ్ స్టాలిన్ ఈ క్రింది మాటల్లో వివరించారు.

"సామ్రాజ్యవాదాన్ని బలహీన పరచి, పడగొట్టడానికి తోడ్పడే జాతుల పోరాటాలకు తప్పకుండా మద్దతు నివ్వాలని దీనర్ధం. సామ్రాజ్యవాదాన్ని కాపాడి బలపరచే వుద్యమాలను ఎట్టి పరిస్థితుల్లోనూ సమర్థించరాదు"

"జాతుల హక్కులకు సంబంధించిన సమస్య స్వయం సంపూర్ణమయిన ప్రత్యేక సమస్యకాదు. అది కార్మిక విప్లవానికి సంబంధించిన జనరల్ సమస్యలో ఒక భాగమే. మొత్తం సమస్యలో అది ఒక భాగము కాబట్టి మొత్తం సమస్యను పరిష్కరించే దృక్పథంలో భాగంగానే దాన్ని పరిష్కరించాలి."

కాబట్టి నిర్దిష్టరూపంలో జరుగుతున్న జాతుల పోరాటాలకు మద్దతు యివ్వాలా లేదా అని ఆలోచించుకునేటప్పుడు కార్మికవర్గం తేల్చుకోవాల్సింది రెండే రెండు విషయాలు. ఆ పోరాటం దేశంలో అప్పుడు కొనసాగుతుండే సామాజిక విప్లవానికి ప్రతిబంధకమా కాదా అనేది ఒకటి. ప్రపంచ సోషలిస్టు విప్లవానికి ఏ మోతాదులో నయినా

ప్రతిబంధకమా అనేది మరొకటి. అది పై విషయాల్లో ప్రతిబంధకమయితే ఎట్టి పరిస్థితిలోనూ ఆ పోరాటానికి కార్మికవర్గం తన మద్దతునివ్వదు. ప్రతిబంధకం కాక పోతే తప్పకుండా మద్దతు యిస్తుంది. అంతేకాదు అలాంటి పోరాటాలకు మద్దతు యివ్వాల్సి వచ్చినప్పుడు, ఆ పోరాటాల్లో వుండే నాయకత్వం అభివృద్ధి కరమయినదా కాదా అనే విషయానికి ప్రాముఖ్యత నీయాల్సిన పనిలేదు. ఈ సందర్భాల్లో కామ్రేడ్ స్టాలిన్ ఇలా చెప్పారు.

"సామ్రాజ్యవాద నిర్బంధం అమలుజరుగుతున్న పరిస్థితుల్లో జరిగే జాతీయోద్య మాల్లో విప్లవ లక్షణాలకు నిదర్శనాలుగా ఆ వుద్యమాల్లో కార్మికవర్గ శక్తుల ప్రవేశం గాని, విప్లవకర లేదా రిపబ్లికన్ కార్యక్రమంగాని, ప్రజాస్వామిక ప్రాతిపదికగాని తప్పనిసరిగా వుండి తీరాల్సినపనిలేదు. ఆఫ్ఘనిస్థాన్ స్వాతంత్ర్యం కొరకు అప్పటి అమీరు (ఫ్యూడల్ లార్డు) కొనసాగిస్తున్న పోరాటం, అమీరూ అతని అనుచరులూ రాచరికవాద అభిప్రాయాలకు కట్టుబడి యున్నవారే అయినప్పటికీ, అది సామ్రాజ్య వాదాన్ని బలహీనపరచి, ఛిన్నాభిన్నం చేయగల్గుతోంది కాబట్టి వాస్తవానికి విప్లవకర పోరాటమే."

కాబట్టి అభివృద్ధినిరోధకులు నాయకత్వం వహిస్తున్నారనే కారణంతో ఈ పోరా టాన్ని నిరసించాలనడం మార్క్సిజం కాదు సరికదా, అందుకు వ్యతిరేకం కూడ. ఇక్కడ తేల్చుకోవలసిందల్లా భారతదేశంలో కొనసాగుతున్న ప్రజాస్వామిక విప్లవా నికి అడ్డంకిగావున్న బడాపెట్టుబడిదారీ, బడాభూస్వామ్యవర్గాలకు చెందిన ప్రభుత్వాన్ని ఈ పోరాటం ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని బలహీన పరుస్తోందా లేక బలపరు స్తోందా అనేది మాత్రమే. ఇంగితజ్ఞానమున్న ప్రతి ఒక్కరికీ ఈ పోరాటం యే దృష్టితో చూసినా ప్రజాస్వామిక విప్లవాన్ని బలహీనపర్చదనీ, అందుకు భిన్నంగా, అలాంటి విప్లవానికి అడ్డుగా నిల్చియున్న ప్రభుత్వాన్నే బలహీనపరుస్తుందనీ అర్థ మవుతుంది.

ఇక రెండవ వాదం: ఇలాంటి పోరాటాలు దేశంలో కొనసాగుతున్న నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని పక్కదారి పట్టించవా అనేది. మొదట నిర్ణయించుకోవా ల్సింది అసలు నిర్దిష్టరూపంలో జరుగుతున్న ఆ జాతుల పోరాటంలో అనాటి సామాజిక విప్లవానికి ప్రత్యక్షంగాగాని, పరోక్షంగాగాని తోడ్పడే పొటెన్షియాలిటీస్ యేమయినా వున్నాయా లేవా అనేది. అలాంటి పొటెన్షియాలిటీస్ యేమయినా వున్నాయనే నిర్ధార ణకువస్తే ఆ పోరాటానికి కార్మికవర్గం తప్పకుండా తన మద్దతునిస్తుంది. అయితే ఆ పోరాటం ప్రజల క్షేమం కొరకే జరుగుతున్నట్టు కనిపిస్తున్నా సారాంశంలో బూర్జువా

వర్గ ప్రయోజనాల కొరకే, బూర్జువా నాయకత్వం కిందనే జరుగుతోందనే విషయాన్ని కార్మికవర్గం ఎన్నడూ మర్చిపోదు. అలాంటి పోరాటాన్ని సాధ్యమయితే అనాడు ఉన్నతస్థాయిలో జరుగుతున్న వర్గపోరాటాన్ని పక్కదారిపట్టించడానికే బూర్జువావర్గం ప్రయత్నిస్తుంది. సాధారణంగా అలాంటి ఉద్యమాల్లో ప్రజల్లో వర్గదృష్టిని లోపింపజేసి అన్నివర్గాల ప్రయోజనాలు ఒక్కటేననే అవాస్తవిక వాతావరణం సృష్టింపబడుతుంది. ప్రజల్లోవున్న విభిన్నవర్గాల ప్రయోజనాలు భిన్నభిన్నంగా వుంటాయనే యదార్థం మరుగున పడిపోతుంది. ప్రత్యేకించి పెట్టుబడిదార్లు తమకున్న ప్రచార సాధనాలన్నిటినీ ప్రయోగించి అలాంటి వాతావరణాన్ని సృష్టించడంపై కేంద్రీకరిస్తారు. కాని అలాంటిది జరగకుండా తనశక్తినంతా వినియోగించి కార్మికవర్గం చైతన్యపూరితంగా కృషిచేయాలి. అంతేకాని ఒక ప్రమాదం జరిగే అవకాశం వుందికదా అని యేదో ఒక మోతాదులో ఆనాటి సామాజిక విప్లవానికి తోడ్పడే పొటెన్షియాలిటీస్ వున్న వుద్యమాన్ని నిరసించడం పొరపాటు. అలాంటిది సామాజికాభివృద్ధిపట్లనూ, మార్క్సిజంపట్లనూ అపచారమే అవుతుంది. ఆ ధోరణి కార్మికవర్గం యొక్క అసమర్థతకు చిహ్నం తప్ప, సమర్థతకు ఎంతమాత్రమూ చిహ్నంకాదు. ఈ విషయంలో "వేర్వేరుగా పురోగమించండి, కలిసి దెబ్బకొట్టండి" అనే లెనిన్ సూక్తిని కార్మికవర్గం సదా గుర్తుంచుకోగల్గాలి.

ఇక మూడవ వాదం మార్క్సిజం ఒక జాతి సమైక్యతను బలపరుస్తుంది గాని, విచ్ఛిన్నతకు తోడ్పడదు అనేది, ఇది ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ ఉభయప్రాంతాల్లోనూ కొనసాగుతున్న రాష్ట్ర విభజనోద్యమాన్ని దృష్టిలోవుంచుకొని చేయబడుతున్న వాదన. సి. పి. ఐ, కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) వగైరాలంతా ఇదే విషయాన్ని చెవిలో ఇల్లు గట్టుకొని వూదరగొడుతున్నారు. ఆంధ్రప్రదేశ్ రెండయిపోతే వచ్చే సోషలిజం ఆగిపోతున్నట్టే వారు వాపోతున్నారు. అలా వాదించే వారంతా రష్యాలోగానీ, మరో చోటగానీ ఇలాంటి రాష్ట్రవిభజనోద్యమాల్లో కార్మికవర్గం మద్దతుయిచ్చినట్టు దాఖలాలు కనిపించడం లేదుకదా అని కూడ అంటారు. అంతేకాక స్టాలిన్‌గాని, లెనిన్‌గాని జాతులను గురించీ, జాతులయొక్క స్వాతంత్ర్యాన్నిగురించీ రాశారేగాని, ఒకేజాతిలో అనేక కారణాలను పురస్కరించుకొని జరిగే ప్రాంతీయ విభేదాలను గురించి ఎక్కడా రాయలేదు కదా అనికూడ అంటారు. ప్రత్యేకించి ఆంధ్రప్రదేశ్‌లో కొనసాగుతున్న ప్రాంతీయ వుద్యమాలు పెట్టుబడివారుల, భూస్వాముల వుద్యమాలు కాబట్టి ఇందులో పాల్గొనడం ద్వారా పీడిత ప్రజల్ని చీల్చడం మాత్రమే జరిగి ప్రజాస్వామిక విప్లవానికి నష్టం వాటిల్లుతుందని కూడ అంటారు. ఈ విషయాన్ని సాకల్యంగా పరిశీలించాలి. జాతుల సమస్యను వివరిస్తూ కామ్రేడ్ స్టాలిన్ ఈవిధంగా రాశారు.

"జాతి అనేది కేవలం చరిత్రకు సంబంధించిన ఒక అంశం మాత్రమేకాదు. నిర్దిష్టమయిన ఒక శకానికి చెందిన, అంటే అభివృద్ధి చెందుతున్న పెట్టుబడిదారీ విధానపు శకానికి చెందిన చారిత్రికాంశంకూడ. ఫ్యూడలిజంయొక్క నిర్మూలన, పెట్టుబడిదారీ విధానం యొక్క అభివృద్ధీ జరిగేక్రమంలోనే, పై వాటితో పాటుగానే ప్రజలు జాతులుగా రూపొందే క్రమంకూడ జరుగుతుంది. ఉదాహరణకు పశ్చిమ యూరప్‌లో అలానే జరిగింది. ఫ్యూడల్ అనైక్యతను నిర్మూలించి, పెట్టుబడిదారీ విధానం విజయవంతంగా పురోగమిస్తున్న కాలంలోనే బ్రిటిష, ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్ తదితర ప్రజలు జాతులుగా రూపొందారు".

"అయితే పై ఉదాహరణలో ఆయా ప్రజలు ప్రత్యేక జాతులుగా రూపొందడంతోపాటుగానే, అదే సమయంలోనే స్వతంత్ర జాతీయ ప్రభుత్వాలుగా కూడ రూపొందాయి. అంటే బ్రిటిష, ఫ్రెంచి అలానే తదితర జాతులు బ్రిటిష వగైరా జాతీయ ప్రభుత్వాలుగా కూడ రూపొందాయి. ఆ క్రమంలో ఐర్లండు భాగస్వామి కాలేదు. అయినా పశ్చిమ యూరపుకు చెందిన పై జనరల్ లక్షణం అందు మూలంగా మారదు".

"తూర్పు యూరపులో పరిస్థితి మరోవిధంగా నడిచింది. పశ్చిమ యూరపులో జాతులు స్వతంత్ర జాతీయ ప్రభుత్వాలుగా రూపొందితే, తూర్పు యూరపులో అనేక జాతులతోకూడిన బహు జాతుల ప్రభుత్వాలు (మల్టీ నేషనల్ స్టేట్సు) యేర్పడ్డాయి. ఆస్ట్రో-హంగరీ, రష్యా ప్రభుత్వాలు అలాంటివే. ఆస్ట్రియాలో జర్మన్లు రాజకీయంగా చాలా అభివృద్ధి చెందినజాతి. కాబట్టి ఆస్ట్రియాలోని తదితర జాతులన్నిటినీ సమైక్యం చేసి ఒకే ప్రభుత్వం కింద సమీకరించే బాధ్యతను జర్మన్లు నిర్వర్తించారు. హంగరీలో వున్న జాతులన్నిటిలోనూ అభివృద్ధిజెంది మాగ్యార్సు అచ్చట ప్రభుత్వాన్నేర్పరచడానికి పూనుకున్నారు. తద్వారా వారు హంగరీలోవున్న మిగిలిన జాతులన్నిటినీ సమైక్యం చేయగల్గారు. శక్తివంతమై బాగా సంఘటితమై, చారిత్రిక పరిణామంలో యేర్పడియున్న అరిస్టాక్రటిక్ మిలిటరీ బురాక్రసీ యొక్క ఆధిపత్యంలో వుండిన గ్రేటు రష్యన్లు, రష్యాలోని తదితర జాతులన్నిటినీ సమైక్యం చేయగల భారాన్ని వహించారు.

"తూర్పు యూరపులో పరిస్థితి అలా నడిచింది. అంటే ఎక్కడయితే ఫ్యూడలిజం అప్పటికింకా నిర్మూలింపబడలేదో, ఎక్కడయితే పెట్టుబడిదారీ విధానం చాల బలహీనంగావుందో, ఎక్కడయితే వెనుకకు నెట్టబడ్డజాతులు అప్పటికింకా ఆర్థికంగా సంఘటితమయి సమగ్రజాతులుగా అభివృద్ధిచెందడంలో జయప్రదం కాలేదో అలాంటి చోట్ల ఇలాంటి బహుజాతుల ప్రభుత్వాలేర్పడే ప్రత్యేక పద్ధతి అమల్లోకి వచ్చింది."

"కాని తూర్పుయూరపులో పెట్టుబడిదారీ విధానం క్రమంగా అభివృద్ధి చెంద సాగింది. వ్యాపార రవాణామార్గాలు అభివృద్ధి చెందసాగాయి. పెద్దపెద్ద పట్టణాలు వెలుస్తున్నాయి. జాతులు ఆర్థికంగా సౌష్టవాన్ని పొందసాగాయి. వెనుకబడ్డ జాతుల యొక్క స్తబ్ధ జీవితంలో నెలకొంటున్న పెట్టుబడిదారీ విధానం వారిని ఉత్తేజపర్చి, కార్యాచరణకు పురికొల్పుతోంది. ప్రెస్సు, థియేటరు వగైరాలలో వచ్చిన అభివృద్ధి మూలంగానూ, రీచిష్టాట్ (ఆస్ట్రియా) డ్యూమా (రష్యా) వగైరా శాసనసభల కార్య కలాపాలమూలంగానూ, "జాతీయ భావాలు" వారిలో బలపడసాగాయి. అభివృద్ధి చెందుతున్న మేధావులు "జాతీయ భావాల"తో ఉత్సాహం పొందడమేగాక ఆ భావాన్ని విస్తృతంగా వ్యాపింపజేయడానికి కూడ పూనుకోసాగారు.

"కాని వెనకకు నెట్టబడి అప్పుడప్పుడే మేలుకొని స్వతంత్ర జీవితాన్ని కాంక్షి స్తున్న జాతులు స్వతంత్ర జాతీయ ప్రభుత్వాలుగా రూపొందలేకపోయాయి. రాజ్యాంగ యంత్రాన్ని చాలకాలంగా తన అదుపులోకి తీసికొని అధికారాన్ని చలాయిస్తున్న జాతికి చెందిన పాలకవర్గం యొక్క శక్తివంతమయిన ప్రతిఘటన వారి దారికడ్డంకిగా తయా రయింది. స్వతంత్ర జాతీయ ప్రభుత్వ నిర్మాణానికి పూనుకోడంలో వారు చాల వెనకబడ్డారు."

"ఆవిధంగా పరిస్థితులు తూర్పు యూరపులోని వెనకబడ్డ జాతుల్ని పోరాట మార్గానికి నెట్టాయి"

కామ్రేడ్ స్టాలిన్ రాసిన పై విషయాన్ని బట్టి జాతులసమస్య అన్ని దేశాలలోనూ అన్ని కాలాలలోనూ ఒకే రూపంలో వుండదని అర్థమవుతుంది. అంతేకాదు ఆ సమ స్యయొక్క స్వభావం ఫ్యూడలిజం యొక్క నిర్మూలన, పెట్టుబడిదారీ విధానంయొక్క అభివృద్ధి ఏ దేశంలో, ఏ కాలంలో, ఏ మోతాదులో జరుగుతుందో ఆపరిస్థితులకు అనుగుణ్యంగా జాతుల సమస్య రూపొందుతుందనికూడ బోధపడుతుంది. కామ్రేడ్ స్టాలిన్ యిచ్చిన పై ఉదాహరణలో పశ్చిమ యూరపులో ఫ్యూడలిజాన్ని నిర్మూలించ డానికి జరిగిన బూర్జువా ప్రజాస్వామిక విప్లవాల్లో భాగంగానే, ప్రధానంగా ఫ్యూడల్ శక్తులకు వ్యతిరేకంగానే జాతుల సమస్యకూడ రూపొందింది.

కాని తూర్పు యూరపులోకూడ ప్రజాస్వామిక విప్లవాల్లో భాగంగానే జరిగినా, ప్రధానంగా అధికారంలోవున్న ఒక జాతికి చెందిన బూర్జువా వర్గానికీ, వెనుకకు నెట్ట బడ్డ జాతులలోని బూర్జువా వర్గాలకూమధ్య సంఘర్షణగా జాతులసమస్య రూపొందింది. చారిత్రక పరిణామంలో పశ్చిమ యూరపులో కంటె ఆలశ్యంగా యిచ్చట పెట్టుబడిదారీ విధానం ఆవిర్భవించడమే అందుకు ప్రధానకారణం. కాబట్టి చారిత్రిక పరిణామ

క్రమంలోనే జాతుల సమస్యను అర్థంచేసికోడానికి ప్రయత్నించాలి. లేకుంటే అనేక తప్పు నిర్ణయాలకు వచ్చి మార్క్సిజం పేరుతోనే మార్క్సిజానికి అపచారం చేస్తాం.

మనదేశంలో జాతుల సమస్యను అలాంటి చారిత్రక దృక్పథంనుండి పరిశీలించుదాం. యూరప్‌లో జనరల్‌గా పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందుతున్న కాలంలోనే, మనదేశం బ్రిటిషువలసగా తయారయింది. సామ్రాజ్యవాదుల ఆధిపత్యం కిందనే మనదేశంలో పెట్టుబడిదారీ ఆర్థిక సంబంధాలు నెలకొన్నాయి. అంతకు పూర్వంవున్న స్వయం సంపూర్ణ గ్రామీణ వ్యవస్థ నశించి పోయింది కాని దానిస్థానే పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చెందలేదు. మార్క్స్ అన్నట్లు పాతవిధానం నశించి పోయింది కాని, కొత్తవిధానం సృష్టింపబడలేదు. ఫ్యూడల్ వ్యతిరేక వుద్యమము సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో భాగంగానే కొనసాగింది. సామ్రాజ్యవాదానికీ, మొత్తం ప్రజానీకానికీ మధ్యనున్న వైరుధ్యమే ప్రధాన వైరుధ్యంగా ముందుకొచ్చింది. అందువల్ల మన దేశంలో జాతీయ చైతన్యం, సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యంలో భాగంగానే రూపొందింది. బెంగాలు విభజనకు వ్యతిరేకంగా అచ్చట జరిగిన పోరాటం మన దేశంలో జాతీయోద్యమం (జాతుల ఉద్యమం) ఆరంభానికి నాంది. ఆ ఉద్యమం నుండి పొందిన ఉత్తేజమే ఆంధ్రజాతి ఉద్యమానికి అంకురమైంది. కాంగ్రెసుకు నాయకత్వం వహిస్తున్న బూర్జువా వర్గం విభిన్న జాతులకు చెందిన ప్రజానీకాన్ని సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సమీకరించడంలో నూతనంగా అభివృద్ధి చెందుతున్న జాతుల చైతన్యానికి అనుగుణంగా భాషా ప్రయుక్త రాష్ట్రాల నిర్మాణాన్ని ప్రాతిపదికగా అంగీకరించింది ఆ ప్రాతిపదికపైననే అన్ని జాతుల్నీ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా అది సమీకరించగలిగింది. కాంగ్రెసు నిర్మాణంకూడ అదే ప్రాతిపదికపై జరిగింది. 1947 లో ప్రజాస్వామిక విప్లవానికి ద్రోహంచేసి భారత బడా బూర్జువా వర్గం (కాంప్రడార్ బూర్జువాజీ) సామ్రాజ్యవాదంతో మిలాఖత్ కావడంద్వారా రాజ్యాధికారాన్ని చేజిక్కించుకొన్ననాటికి జాతుల సమస్యకు సంబంధించినంతవరకు ఉన్న పరిస్థితి ఇది.

రష్యాలో ఆస్ట్రో–హంగరీల మాదిరిగా ఏదో ఒక అభివృద్ధి చెందిన జాతి మిగిలిన జాతుల నన్నింటిని సమైక్యం చేయడం ఇక్కడ జరగలేదు. బ్రిటిషు సామ్రాజ్య వాదులనుండి ఏదో ఒక జాతికి చెందిన బూర్జువా వర్గానికి అధికారం దఖలు కావడంగాక దేశంలో ఉన్న కాంప్రడార్ బూర్జువాజీ, బడా భూస్వాములు అధికారాన్ని హస్తగతం చేసుకొన్నారు. వారి ప్రయోజనాల దృష్ట్యా రాష్ట్రాలు కేవలం పాలక విభాగాలుగానే ఉండి (administrative units) ఆర్థిక, రాజకీయాధికారం అంతా కేంద్ర ప్రభుత్వం చేతిలోనే కేంద్రీకృతం కావడం అవసరం, అందువల్ల "భారతజాతి", "భారతీయ

ంస్కృతి", "అఖండ భారతం", "భారతజాతి అవిభాజ్యమైనది" మొదల గునినాదాలతో
ాతనంగా అభివృద్ధి చెందుచున్న జాతుల అభివృద్ధికి ఈ కాంప్రిడార్ బూర్జువా.
ూ భూస్వాముల చేతుల్లోఉన్న కేంద్ర ప్రభుత్వం అడ్డంకిగా తయారైంది. అందు
ల్లనే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటకాలంలో భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణాన్ని
మోదించిన కాంగ్రెసే, తీరా అధికారంలోకి వచ్చిన తర్వాత ఆచరణలో అందుకు
్యతిరేకించసాగింది. ఎంతో రక్తబలిదానం జరిగిన ఫలితంగాగాని చివరకు భాషా
ప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడలేదు.

అభివృద్ధి చెందుతున్న జాతుల సమస్య పరిష్కారానికి భాషాప్రయుక్త
రాష్ట్రాల నిర్మాణం ఆరంభమే గాని తుది మాత్రం కాదు. తమ భవిష్యత్తును
తాము రూపొందించుకొనేందుకు వీలుగా సర్వసత్తాక ప్రభుత్వాలుగా ఆయా జాతులు
రూపొందడమే అందుకు తుదిపరిష్కారం. అవి ఒకే భారత సమాఖ్యలో కలిసి
ఉంటాయా అనేది ప్రత్యేక విషయం. ఆ విషయాన్ని తమతమ శ్రేయస్సు దృష్ట్యా
వలంటరీగా అప్పుడా ప్రభుత్వాలు నిర్ణయించుకొంటాయి. అలాంటి స్థితి ఏర్పడేటంత
వరకు కేంద్రంలో అధికారాన్ని చేజిక్కించుకొని ఉన్న కాంప్రడార్ బూర్జువాజీకి, అభి
వృద్ధి చెందుతున్న వివిధ జాతులకు చెందిన బూర్జువా, భూస్వామ్య వర్గాలకు మధ్య
వైరుధ్యం ఏదో ఒక రూపంలో కొనసాగుతూనే ఉంటుంది. అది ఒకప్పుడు నిర్బంధ
హిందీ వ్యతిరేకోద్యమంగా రూపొందవచ్చు; వెనుకబడ్డ ప్రాంతాల్ని కేంద్రం చిన్న
చూపు చూస్తోందనే రూపంలో బహిర్గతం కావచ్చు. కేంద్రాన్ని కేవలం దేశరక్షణ,
కమ్యూనికేషన్లు మొదలైన కొన్ని అంశాలకు మాత్రమే పరిమితంచేసి ఆయా జాతులు
ఆర్థికంగానూ, సాంస్కృతికంగానూ అభివృద్ధిచెందడానికి వీలుగా రాష్ట్రాల అధికారాన్ని
విస్తృతంగా పెంచాలనే రూపం తీసుకోవచ్చు. ఏ రూపం తీసుకొన్నా పైవన్నీ పాక్షిక
పరిష్కారాలే. సర్వసత్తాకాధికారంగల స్వతంత్ర జాతుల ప్రభుత్వాలేర్పడే వరకు
కేంద్రంలో అధికారంలోఉన్న కాంప్రడార్ బూర్జువాజీకి, ఆయా జాతులలోనున్న పెట్టు
బడిదారీ, భూస్వామ్య వర్గాలకుమధ్య వైరుధ్యం విభిన్న రూపాల్లో కొనసాగుతూనే ఉం
టుంది. అందుకే కమ్యూనిస్టుపార్టీ (మా-లె) ఈ సమస్యకు పరిష్కారంగా విడిపోయే
హక్కుతోసహా జాతులన్నింటికీ స్వయం నిర్ణయ సూత్రాన్ని ఆమోదించింది. ఈనాటి
బడాబూర్జువా, భూస్వామ్యవర్గాల ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆయా జాతులకు చెందిన
పీడిత ప్రజానీకాన్ని సమైక్యం చేయగలిగింది ఆ సూత్రం ఒక్కటే.

కాబట్టి మన దేశంలో తూర్పు యూరపు దేశాల్లోని బహుజాతుల ప్రభుత్వాల్లో
మాదిరిగా జాతులసమస్య అధికారంలోనున్న జాతికి చెందిన బూర్జువావర్గానికీ, వెనుకబ

నెట్టబడ్డ జాతులలోని బూర్జువావర్గానికి మధ్య వైరుధ్యంగాగాక, కేంద్రంలో అధికారం
చేజిక్కించుకొని ఉన్న కాంప్రడార్, బడాభూస్వామ్య వర్గాల ప్రభుత్వానికీ, ఆయా
జాతులకుచెందిన పెట్టుబడిదారులకూ, భూస్వాములకూ మధ్య వైరుధ్యంగా రూపొందడం
ఒక ప్రత్యేకత. (పెక్యూలియారిటీ)

మరో ప్రత్యేకత కూడ ఉంది. బ్రిటిషు సామ్రాజ్యవాదులు మన దేశాన్ని
పాలించిన రోజులలోనే వందల సంఖ్యలో స్వతంత్ర సంస్థానాలు ఉన్నాయి. తమకు
అండగా ఉంచుకొనే లక్ష్యంతోనే సామ్రాజ్యవాదులు ఉద్దేశపూర్వకంగానే వాటి మను
గడను కాపాడుతూ వచ్చారు. 1947 లో మనదేశంలోని కాంప్రడార్ బూర్జువాజీతో
మిలాఖత్ అయి వారికి రాజ్యాధికారం దఖలుచేసినప్పుడు కూడ ఆ సంస్థానాల మనుగ
డను అలానే ఉంచే షరతుతోనే చేశారు. ఆ తర్వాత సంస్థానాధిపతులతో రాజీపడి
క్రమంగా వాటినన్నింటిని భారత ప్రభుత్వంలో సంలీనం చేయగలిగింది కాంగ్రెసు
ప్రభుత్వం. ఆ క్రమంలో అన్నింటికంటె ఆలస్యంగానూ, ప్రత్యేక వాతావరణం
లోనూ నిజాం సంస్థానం రద్దై, ఆ ప్రాంతం కూడ యూనియన్ ప్రభుత్వంలో
చేరింది. ఆ తర్వాత 1956 నవంబరులోగాని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం అవతరించ
లేదు. అదైనా తెలంగాణా పెట్టుబడిదార్లు, భూస్వాముల నుండి వచ్చిన తీవ్రమైన
ప్రతిఘటనను పెద్దమనుష్యుల ఒప్పందం ద్వారా చల్లార్చిన తర్వాతనే ఆంధ్రప్రదేశ్
అవతరణ జరిగింది. అయినా రాజ్యాధికారాన్ని తమ స్వప్రయోజనాలకు ఉపయో
గించుకొనే సందర్భంలో ఆంధ్ర, తెలంగాణా భూస్వాముల, పెట్టుబడిదారుల మధ్య
అంతర్గత వైరుధ్యాలు చెలరేగుతూనే వచ్చాయి. కాంప్రడార్, బడా భూస్వాముల
చేతుల్లోఉన్న ప్రభుత్వం ప్రజాస్వామిక విప్లవకర్తవ్యాలను అంటే ఫ్యూడలిజాన్ని సమూ
లంగా నిర్మూలించడం, వ్యావసాయకంగానున్న దేశాన్ని పారిశ్రామిక దేశంగా రూపొం
దించడం, ఆధునిక యంత్రాల నుపయోగించి వ్యవసాయాన్ని అభివృద్ధిచేయడం మొద
లగు కర్తవ్యాలను పూర్తిచేయలేదు. చేయజాలదు కూడ. అటు సామ్రాజ్యవాదులతోనూ,
ఇటు భూస్వామ్య వర్గాలతోనూ అది మిలాఖత్ అయిపోవడమే అందుకు కారణం.
పర్యవసానంగా సాధారణ ప్రజల జీవితం నానాటికి కష్టభూయిష్ఠంగా తయారైంది.
ప్రభుత్వంపై తీవ్రమైన అసంతృప్తివ్యాపించింది. నాయకత్వపు విద్రోహం మూలంగా
అసంతృప్తి రేకెత్తిన ప్రజల్ని విప్లవపోరాటంలో సంఘటిత పరచడం జరగలేదు. ఈ
పరిస్థితులన్నింటి మూలంగా 1956 లో తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాలు ఒకే రాష్ట్రంగా
సంలీనమైనప్పటికీ రెండు ప్రాంతాల ప్రజలమధ్య సుదృఢమైన సంఘీభావం ఏర్పడ
లేదు. అంతేకాదు శతాబ్దాలతరబడి వేరువేరు పరిపాలనక్రింద జీవించడానికి అలవాటు
పడియుండడం మూలంగా ఆంధ్రులువేరు, తెలంగాణావారువేరు అనే మనస్తత్వం

ఇరు ప్రాంతాల్లోనూ మాసిపోలేదు. ఈ ప్రభుత్వం ప్రజాస్వామిక విప్లవకర్తవ్యాలను పూర్తిచేయగలిగి ఉన్నట్లయితే అంటే ఫ్యూడలిజం నిర్మూలించబడి, ప్రజల ఆర్థిక జీవితం సాఫీగా అభివృద్ధి చెందడం జరిగివుంటే ఆ క్రమంలో రెండు ప్రాంతాలమధ్య వేర్వేరు మనస్తత్వాలు నశించి సమగ్రమైన జాతిగా రూపొందేదే. కాని అలాంటిది జరగనందు వల్ల ఉభయప్రాంతాలలోని భూస్వామ్య పెట్టుబడిదారీ వర్గాలు తమ స్వప్రయోజనాల కవసరమైనప్పుడల్లా ప్రజలలోఉన్న వేర్పాటు మనస్తత్వాన్నీ, జనరల్‌గా ప్రభుత్వంపై తీవ్రతరంగానున్న అసంతృప్తినీ వినియోగించుకొని ప్రాంతీయ విభేదాల్ని రెచ్చగొట్టడం తేలికైంది. "బలమైన కేంద్ర ప్రభుత్వం ఉండాలి" అనే సాకుతో వివిధ జాతులు స్వయం సంపూర్ణజాతులుగా అభివృద్ధి చెందడానికి ఆచరణలో అడ్డుపడుతున్న కేంద్ర ప్రభుత్వంలోని పాలకవర్గాలు తమ స్వప్రయోజనాల దృష్ట్యా ఒకప్పుడు ఒక ప్రాంతం వారికి, మరొకప్పుడు ఇంకొక ప్రాంతంవారికి మద్దతునిస్తూ రావడం కూడ ఈ ప్రాంతీయ విభేదాలు మరింత పెరగడానికి తోడ్పడింది. దాని పర్యవసానమే 1969 లో ప్రత్యేక తెలంగాణా కొరకు జరిగిన పోరాటమైనా, ఈనాడు ఉభయప్రాంతాలలోనూ కొనసాగుతున్న రాష్ట్ర విభజనోద్యమమైనా. ఇది ఒక్క ఆంధ్ర ప్రాంతంలోనేకాదు ఎక్కడెక్కడైతే శతాబ్దాలుగా వేరువేరు ప్రభుత్వాలకింద (స్వదేశ సంస్థానాలుగాని, బ్రిటిషు ప్రభుత్వంలోని రాష్ట్రాలుగాని) జీవించడానికి అలవాటుపడ్డ ప్రజలతో సమైక్య రాష్ట్రాల నిర్మాణం జరిగిందో (composite states) తరతమస్థాయిల్లో అక్కడల్లా ఇలాంటి ప్రాంతీయ విభేదాలు తల ఎత్తడం, అవి చరమస్థాయినందుకొన్న తర్వాత రాష్ట్ర విభజనోద్యమంగా రూపొందడం భారత దేశమంతటా కనిపిస్తోంది. ఇది మరో ప్రత్యేకత.

ఇదీ భారత దేశంలో జాతుల సమస్య రూపొందుతున్న తీరు. క్లుప్తంలో చెప్పాలంటే యూరపులో మాదిరిగాగాక ప్రజాస్వామిక విప్లవానికి ద్రోహంచేసి సామ్రాజ్యవాదులతో మిలాఖత్అయి కేంద్రంలో అధికారాన్ని చేజిక్కించుకొన్న దళారీ బూర్జువా వర్గానికి రాష్ట్రాలలో ఉన్న పెట్టుబడిదారీ భూస్వామ్యవర్గాలకు మధ్య ఘర్షణగా ఇచ్చట రూపొందుతోంది. ఆ క్రమంలో భాగంగానే సంస్థానాలు రద్దుచేయబడినతర్వాత భారత దేశంలో ఆంధ్రప్రదేశ్‌లాగా యేర్పరచబడ్డ కొన్ని సమైక్య రాష్ట్రాలలో ప్రత్యేక రాష్ట్రాలు ఏర్పడాలనే లక్ష్యంతో ప్రాంతీయ ఘర్షణలుకూడ జరుగుతున్నాయి. కొన్ని శతాబ్దాలుగా వేర్వేరు యూనిట్సులో జీవించడం మూలంగా ప్రజలలో ఏర్పడ్డవేర్పాటు మనస్తత్వమూ, జనరల్‌గా ప్రభుత్వంపై ఉన్న వ్యతిరేకతా ఆ ఘర్షణలకు నాయకత్వం వహిస్తున్న భూస్వామ్య పెట్టుబడిదారీ వర్గాలకు పెట్టుబడిగా ఉపకరిస్తున్నాయి. అందు

వల్ల భారతదేశంలో ప్రత్యేక పరిస్థితుల్లో రూపొందుతున్న జాతుల సమస్యలో భాగం గానే ఇలాంటి ప్రాంతీయ ఉద్యమాల్ని చూడాలితప్ప, "జాతిని చీల్చడం"గానో విచ్ఛిన్నకర ఉద్యమాలుగానో చూడరాదు.

జాతుల సమస్య ఇలాంటి రూపం తీసుకొన్న చోట్ల రాష్ట్రవిభజన జరిగి వేర్వేరు రాష్ట్రాలు ఏర్పడిన మరునాటినుండీ కొత్తగా ఏర్పడే రాష్ట్రాలలో ఉండే పెట్టుబడిదారీ భూస్వామ్యవర్గాలకూ, ఆర్థిక రాజకీయ అధికారాన్ని తమ గుప్పెటలో ఉంచుకొన్న కేంద్రప్రభుత్వంలోని పాలకవర్గాలకూ మధ్య ఘర్షణ చెలరేగక తప్పదు. భారత దేశంలో ఆరంభమై కొనసాగుతున్న వ్యావసాయ విప్లవ పోరాటంతోపాటు ఆ ఘర్షణ కూడ విభిన్నరూపాల్లో వ్యక్తంకాక తప్పదు. రైతాంగ సాయుధ విప్లవ పురోగమన క్రమంలో విభిన్న జాతుల పీడితప్రజలు తప్పకుండా సమైక్యమౌతారు ప్రాంతీయ విభేదాలు తారాస్థాయి నందుకొన్న యీ పరిస్థితుల్లో రాష్ట్రవిభజన రైతాంగ సాయుధ విప్లవంలో తిరిగి విభిన్న ప్రాంతాల ప్రజలు సమైక్యం కావడానికి తోడ్పడుతుందేతప్ప ఎట్టి పరిస్థితులలోనూ అవరోధం కాదు. ప్రత్యేకించి ఈనాడున్న విప్లవ పరిస్థితిని దృష్టిలో ఉంచుకొని ఆలోచిస్తే అది ఎట్టిపరిస్థితులలోనూ అవరోధం కాజాలదు. 'జాతి విచ్ఛిన్నం అవుతుంది'అనే పేరుతోనో, మరో అంధ విశ్వాసంతోనో యదార్థ పరిణామాన్ని గుర్తించకుండా ఈ ఉద్యమాలకు అడ్డుతగిలి నిర్బంధంగా ఒకే రాష్ట్రంలో ఉంచడంద్వారా రెండు ప్రాంతాల ప్రజలు కేంద్రప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడడం పోయి, ఒకరితో మరొకరు పోరాడుకొనే దుస్థితికిదిగి తద్వారా తెలుగుజాతి శాశ్వతంగా రెండు శత్రుక్యాంపులుగా చీలిపోవడమూ, ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఆరంభమై రైతాంగ సాయుధ పోరాటంగా జరుగుతున్న వ్యవసాయక విప్లవం విపరీత నష్టాలకు గురికావడమూ జరుగుతుంది. ఈ సందర్భంలోనే మరోవిషయంకూడ గుర్తుంచుకోవాలి. ప్రజాస్వామిక విప్లవంలో భాగంగానే జాతుల అభివృద్ధి జరుగుతుందని అందరూ అంగీకరిస్తారు. పశ్చిమయూరపులో ఆ విప్లవం పెట్టుబడిదారీ విధానంయొక్క అభివృద్ధికర దశలోనే జరిగింది. అందువల్ల ఫ్యూడలిజం నిర్మూలింపబడడంతోపాటు విభిన్నజాతులు అచ్చట స్వతంత్ర ప్రభుత్వాలుగా కూడ రూపొందాయి.

తూర్పు యూరపులో ముఖ్యంగా రష్యాలో పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాదంగా రూపొందిన తర్వాత ప్రజాస్వామిక విప్లవం జరిగింది. అందులోభాగంగానే జాతుల సమస్య పశ్చిమ యూరపుకంటే భిన్నమైన రీతిలో జరిగింది.

ఈనాడు భారతదేశంలో అంటే సామ్రాజ్యవాదం మొత్తంగా నాశనం కానున్న యుగంలో సోషలిజం ప్రపంచవ్యాపితంగా విజయంపొందుతున్న యుగంలో కార్మికవర్గ

నాయకత్వాన నూతన ప్రజాస్వామిక విప్లవంతోపాటు జాతుల సమస్యకూడ కొనసాగుతోంది. ప్రజాస్వామిక విప్లవంతో పెనవేసికొనిఉండే జాతుల సమస్య రష్యాలోకంటే భిన్నమైన పరిస్థితుల్లో ఇక్కడ రూపొందుతోంది. అయితే ఇచ్చట జాతుల సమస్య యూరపులో పరిష్కారమైనట్లు బూర్జువా పరిధిలోకూడ పరిష్కారంకాదు. అందుకు కారణం ఇచ్చట జరుగుతున్న ప్రజాస్వామిక విప్లవంలో బూర్జువావర్గం నాయకత్వ పాత్రను కోల్పోవడమే. ఒక్క భారతదేశంలోనేకాదు రష్యా విప్లవం పూర్తి అయిన తర్వాత వెనుకబడిన దేశాలన్నిటాకూడ ప్రజాస్వామిక విప్లవాలకు నాయకత్వంవహించే పాత్రను బూర్జువావర్గం కోల్పోయింది.

అలాంటి విప్లవాలన్నీ ఈనాడు కార్మికవర్గ నాయకత్వాన నూతన ప్రజాస్వామిక విప్లవాలుగానే కొనసాగుతున్నాయి. దీనినిబట్టి ఏమి తెలుస్తుంది? కేంద్రంలో అధికారంలోనున్న గుత్తపెట్టుబడిదారీ వర్గానికీ, విభిన్నజాతులకు చెందిన పెట్టుబడిదారీ, భూస్వామ్య వర్గాలకు మధ్యనున్న వైరుధ్యాన్ని ప్రజాతంత్ర విప్లవంలో భాగంగా పరిష్కరించుకోడానికీ, అలాంటి పోరాటాలకు నాయకత్వం వహించడానికీ ఆయా జాతులకు చెందిన బూర్జువావర్గం సిద్ధంగాలేదు. అలాంటి పరిస్థితుల్లో విప్లవ పోరాటం తీవ్రతరంగా అభివృద్ధిచెందని ప్రాంతాల్లోనూ, విప్లవ పోరాటం ఆరంభమై తాత్కాలికంగా దెబ్బతిన్న ప్రాంతాల్లోనూ అధికారాన్ని పంచుకొనే ఘర్షణలుగానో (రాష్ట్ర. కేంద్ర ప్రభుత్వాలమధ్య) ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతున్నట్లు రాష్ట్రవిభజనోద్యమాలుగానో, ఇలాంటివే మరికొన్ని రూపాల్లో ఘర్షణలుగానో రూపొందవచ్చు. అయితే ఆ ఘర్షణలలో పాల్గొనే ప్రజల్లో విప్లవ పొటెన్షియాలిటీస్ ఉన్నాయనీ, ప్రభుత్వంపై తీవ్రమైన అసంతృప్తి పేరుకొని ఉండడం మూలంగానే ఆ పోరాటాల్లో ప్రజలు పెద్ద ఎత్తున పాల్గొంటున్నారనీ మనం మర్చిపోరాదు. అందువల్ల ఆ పోరాటాల్లో పాల్గొనే ప్రజల్లోఉన్న పొటెన్షియాలిటీస్‌ను సాయుధ వ్యవసాయిక విప్లవానికి అనుకూలంగా ఉపయోగించుకోవడానికి వీలుగా కార్మికవర్గం అలాంటి ఘర్షణల ఎడల (కేంద్ర ప్రభుత్వంయొక్క నిరంకుశాధికారాన్ని బలపరచడానికి తోడ్పడే ప్రత్యేక ఘర్షణలలో తప్ప) అనుకూలవైఖరినే తీసుకోవాలి. తద్వారానే ఆయా ఘర్షణలకు నాయకత్వం వహిస్తున్న బూర్జువా, భూస్వామ్య వర్గాలను ప్రజలనుండి వేరుచేసి, ప్రజల్లో ఉన్న విప్లవ శక్తిసామర్థ్యాలను (రివల్యూషనరీ పొటెన్షియాలిటీస్) ప్రభుత్వ వ్యతిరేక సాయుధ రైతాంగ విప్లవంలో సంఘటితపర్చడం సాధ్యమవుతుంది. రైతాంగ విప్లవం విజయం పొందడం ద్వారానే సమగ్రమైన జాతులు రూపొందుతాయి. ఈ దృష్టితోనే ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లోని ఉభయప్రాంతాల్లో జరుగుతున్న పోరాటాన్ని జాతుల సమస్యపై

జరుగుతున్న పోరాటంలో అంతర్భాగంగా చూచి. దీనియెడల మార్క్సిజాన్ని ఆమోదించేవారంతా అనుకూలవైఖరి తీసుకోవాల్సిఉంటుంది. అంతేగాని ఎట్టిపరిస్థితుల్లోనూ విచ్ఛిన్నకర ఉద్యమంగా చూడాల్సిన పనిలేదు.

ఇక నాల్గవ వాదన. ఈ పోరాటాన్ని రెండుజాతులమధ్య జరుగుతున్న జరుగుతున్న పోరాటంగా ఎందుకు భావించరాదు? అనేది యీ పోరాటంపట్ల ప్రజల్లో ముఖ్యంగా పట్టణ మధ్యతరగతి ప్రజల్లోనూ, విద్యార్థి యువజనుల్లోనూ కనిపిస్తున్న ఉత్సాహాన్నిచూచి, ఆ పోరాటాన్ని సమర్థించడానికి సిద్ధమై, దానిని సమర్థించుకోవడానికి కారణాలు పరిశీలిస్తున్న మిత్రులనుండి ప్రధానంగా ఈ ప్రశ్నవస్తోంది.

ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలకుచెందిన ప్రజలంతా యింకా సమగ్రమైన అభివృద్ధిపొందని ఒకేజాతి ఒకేభాష మాట్లాడుతారు, ఒకే భూభాగంలో నివసిస్తున్నారు. ఒకేవిధమైన ఆర్థికవిధానం ఉంది. అయితే శతాబ్దాలుగా వేర్వేరు ప్రభుత్వాలక్రింద జీవించడానికి అలవాటుపడిన కారణంచేత ఉభయప్రాంతాల ప్రజలలోను తాము వేరు వేరు అనే మనస్తత్వం జీర్ణించుకొనిఉంది. ఫ్యూడలిజం నిర్మూలింపబడి, దేశం పారిశ్రామికం చేయబడి ఆర్థికాభివృద్ధిచెందే క్రమంలో ఉభయప్రాంతాల ప్రజల్లోను వేర్వేరు భావాలునశించి సమగ్రమైన జాతిగా రూపొందడం జరుగుతుంది. ఈ ప్రభుత్వ ఆధిపత్యంక్రింద అలాంటి అభివృద్ధి జరగని కారణంగానే ప్రాంతీయ విభేదాలింకా కొనసాగుతూ ఉన్నాయి. ఆ విభేదాలే ఈనాటి రాష్ట్ర విభజనోద్యమానికి ప్రాతిపదిక. ఈరోజు వేర్వేరు రాష్ట్రాలు కావాలని కోరుకొన్నంతమాత్రంచేత రెండూ వేర్వేరుజాతులని సిద్ధాంతం చేసుకోనవసరంలేదు. రెండు రాష్ట్రాలుగా ఏర్పడిన తర్వాత తప్పకుండా రెండు రాష్ట్రాలు రాజకీయ ఆర్థికాధికారాన్నంతటినీ తమ గుప్పెటలో పెట్టుకొనిఉన్న కేంద్రప్రభుత్వానికి వ్యతిరేకంగా సంఘర్షణ జరుపక తప్పదు. రెండురాష్ట్రాలలోనూ పాలకవర్గాలకు వ్యతిరేకంగా వ్యవసాయక విప్లవం పురోగమించక తప్పదు. ఆనాడు తెలంగాణా ప్రజల దారిద్ర్యానికీ, దినం దినం పెరుగుతున్న నిరుద్యోగానికీ ఆంధ్రుల పెత్తనం కారణమనే సాకుచెప్పి వ్యవసాయ విప్లవంలో పాల్గొనే రైతాంగాన్ని తెలంగాణ భూస్వాములు మభ్యపుచ్చలేరు. అలాంటి పరిస్థితే ఆంధ్ర భూస్వాములను కూడ ఎదుర్కొనక తప్పదు. ఉభయప్రాంతాల ప్రజలు భారతదేశ వ్యాపితంగా కొనసాగుతున్న వ్యవసాయక విప్లవంలో భాగంగా తప్పకుండా సమైక్యమౌతారు. ఈ అభివృద్ధి నిరోధక ప్రభుత్వాన్ని నిర్మూలించి, దీనిస్థానే స్థాపించబడే కూలీరైతు రాజ్యంలో తప్పకుండా ఆంధ్ర ప్రజానీకమంతా ఒకే ప్రభుత్వంక్రింద సమైక్యమై సమగ్రమైన జాతిగా రూపొందకతప్పదు,

అందువల్ల యీ వ్యాసంలో పైన వివరించినట్లు భారత దేశంలోని ప్రత్యేక పరిస్థితుల్లో రూపొందుతున్న జాతుల సమస్యలో భాగంగానే ఆంధ్రులంతా సమగ్రమైన ఒకే జాతిగా రూపొందే క్రమంలో భాగంగానే ఈ రాష్ట్ర విభజనోద్యమాలను అర్థంచేసుకోవాలిగాని అందుకొరకు అవాస్తవికమైన రెండు జాతుల సిద్ధాంతానికి పూనుకోవాల్సిన పనిలేదు.

మార్క్సిజం పేరుతో భారత దేశంలో నెలకొన్న ప్రత్యేక పరిస్థితుల్లో, జాతుల సమస్యలో భాగంగానే జరుగుతున్న ప్రత్యేకరాష్ట్ర వుద్యమాల్ని నిరశించకుండా తాత్కాలికంగా వేర్వేరు రాష్ట్రాల నేర్పరచుకున్నా, భారత దేశంలోని బడా బూర్జువా, బడా భూస్వాముల ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరుగుతున్న నూతన ప్రజాస్వామిక విప్లవంలో ఉభయ ప్రాంతాల ప్రజలు సమైక్యమయి, సమగ్రమయిన జాతిగా రూపొందుతారనే విశ్వాసంతోనే మార్క్సిజాన్ని ఆమోదించేవారంతా యీ పోరాటాలకు తమ మద్దతు నివ్వగలరని ఆశిద్దాం.

---

ఈ నైతిక విద్య అనేది మార్క్సిస్టు సిద్ధాంతంలో అసాధారణ పరిణామం. రష్యన్లు ఎన్నడయినా అంతదూరం ఆలోచించినరా అని నాకు సందేహాస్పదంగ వుంటుంది. గతంలో నాకున్న అవగాహననుబట్టి నైతికసూక్తులుగా అనుకునే స్థాయికి చైనీస్ మార్క్సిజం లేచిందనేది నిస్సందేహం.

సొంతంతో పోరాడటం, సుఖాన్ని తిరస్కరించటం- అలా చేస్తూనే ఉండటం, సంవత్సరం తర్వాత సంవత్సరం ఒకసారి తర్వాత ఇంకోసారి, వరుసగా స్వప్రయోజనాన్ని ఒదిలెయ్యటం, స్వప్రయోజనం యొక్క అన్ని లక్షణాలనూ ఎదుర్కోటం, అలాచేస్తూకూడా ఇవి భవిష్యత్తులో చాలాకాలం చేయాల్సి వచ్చేవిగా ఫీలవటం, ఇదంతా మార్క్సిజంకు ఒకరకంగా కొత్తనే.

తరంతర్వాత తరం చాలా తరాలుగా మానవుల హృదయాల్లో పరివర్తన రావాలని చెప్పినవారిని మనం త్రోసిపుచ్చుతుండేవారం కాని, ఇదే ఇప్పుడు చైనాలో జరుగుతున్నది. ఇప్పుడు చైనాలో ఉపదేశించ బడుతున్నది.

విప్లవంకు గురి ఇతరులన్నప్పైకాక తననుకూడా గురిగానే ఎంచుకోవాలి. తనలో ఉండే చెడుకు వ్యతిరేకంగా పోరాడుతుండాలి అనేది గుర్తించాలి. వ్యక్తికి తన ఎడల తనకుకూడా గతితార్కిక దృక్పథం ఉండాలి.

— డా॥ జోసెఫ్ నీధమ్
ఇంగ్లండు

# సమ సమాజంలో విద్య

## సాంస్కృతిక విప్లవంతరవాత జనచైనాలో విద్యావిధానం

కన్సర్న్‌డ్ ఏసియన్ స్కాలర్స్ కథనం.

స్వేచ్ఛానువాదం : రాంప్రసాద్

(గత సంచిక తరువాయి)

### పెకింగ్ యూనివర్సిటీ:

1898 లో స్థాపింపబడిన పెకింగ్ యూనివర్శిటీ చాలా త్వరలోనే చైనా బుద్ధి జీవులందరికీ కేంద్రమయింది. నేటికీ అది ప్రముఖ పాత్ర నిర్వహిస్తూంది 1911-49 సం. ల మధ్య దేశవ్యాప్తంగా విద్రోహచర్యలు అంతర్యుద్ధాలు జరుగుతున్న కాలంలో ప్రధానమైన రాజకీయ, మేధావి ఉద్యమాలకు ఈ యూనివర్సిటీ ఆటపట్టయింది. 1919లో మే ఫోర్తు ఉద్యమం యిక్కడ విద్యార్థులే ప్రారంభించేరు. ఇక్కడ విద్యార్థి కానప్పటికీ, లైబ్రరీ అసిస్టెంటుగా ఉంటూ, మావో యిక్కడే మార్క్సిస్టు సిద్ధాంతాలు అధ్యయనం చేసేడు మొట్టమొదటిగా యూనివర్సిటీ అధికార్లను విమర్శిస్తూ, యిక్కడి ఫిలాసఫీ శాఖ విద్యార్థులు యువ అధ్యాపకులు 1966 లో మే 25న పెద్ద పెద్ద పోస్టర్లు అతికించారు ఇదే సాంస్కృతిక విప్లవ ప్రారంభం। ఈ సంప్రదాయాన్ని కొనసాగిస్తూ నేడు కళాసంస్థలలో విద్యావిప్లవానికి పెకింగ్ యూనివర్సిటీ ఆదర్శప్రాయంగా నిలిచింది.

నగరం బయట అందమైన పరిసరాల్లో పెకింగ్ యూనివర్సిటీ ఉంది. ఆకర్షణీయమైన పురాతన చైనా శిల్పకళా పద్ధతిలో కట్టిన భవనాలు ప్రాంగణమంతా విస్తరించి ఉన్నాయి. రకరకాల చెట్ల మధ్య, పూలతోటలమధ్య, చిన్న చిన్న జలప్రవాహాలు దాటుతూ కాలినడకన సైకిళ్ల మీద విద్యార్థులు కనపడతారు. అది విద్యాలయాలకి చాలా ఆదర్శప్రాయమైన వాతావరణం. సమాజంనుంచి వేర్పడి, నిర్లిప్తమైన ఒంటరితనంలో మునిగి పోడానికి అది చాలా అనువైన వాతావరణం. నిజానికి సాంస్కృతిక విప్లవం అక్కడ ప్రశాంత జీవితానికి కుదుపునిచ్చేవరకు పెకింగ్ యూనివర్సిటీ విద్యార్థులు అలాటి ఒంటరి జీవితమే గడిపేవారు.

1966-70 సం. ల మధ్య సాంస్కృతిక విప్లవం జరుగుతున్నప్పుడు పెకింగ్ యూనివర్సిటీలో విద్యా బోధన ఏమీ జరగలేదు. ఆ కాలంలో తీవ్రమైన వాగ్వాదాలూ హోరాహోరీ పోరాటాలు జరిగాయి. 1970 నుండి పెకింగ్ యూనివర్సిటీతో పాటు మరికొన్ని ఉన్నతవిద్యా సంస్థల్లో విద్యార్థుల్ని చేర్చుకోవడం, యూనివర్సిటీ విద్యా సంస్కరణలు మొదలయేయి. ఇదంతా యింకా ప్రారంభదశలోనేవుంది. మేము చూచిన అనేక చోట్ల యూనివర్సిటీలు యింకా తెరువలేదు. అయితే, ప్రతిచోట

యూనివర్సిటీ విద్యకి సంబంధించిన వారందరూ విద్యార్థుల్ని చేర్చుకునే పద్ధతులు, పాఠ్యాంశాలు-కోర్సులు గురించి చర్చిస్తూ పథకాలు తయారుచేస్తున్నారు. చైనా నాయకులుకూడా వెంటనే అన్ని యూనివర్సిటీలు ప్రారంభించాలనే తహతహ చూపడంలేదు. తొందరపడి క్లాసులు ప్రారంభించేబదులు, ముందు క్షుణ్ణంగా చర్చలు జరిపి పాత విధానంలోని లోపాలు సవరించి కొత్తవిద్యావిధానం జాగ్రత్తగా రూపొందించమని ప్రోత్సహిస్తున్నారు.

1970 జూన్ నుండి తాత్కాలిక ప్రయోగ ప్రాతిపదికపై పెకింగ్ యూనివర్సిటీలో విద్యార్థుల్ని చేర్చుకుంటున్నారు. ఇది త్వరగా చెయ్యాలని అనుకున్నప్పటికీ న్యాయశాస్త్రం, గ్రంథాలయశాస్త్ర విభాగాల్లో యింకా విద్యార్థుల్ని చేర్చుకోలేదు. యూనివర్సిటీ మొత్తంమీద ఇప్పుడు 3,000 మంది విద్యార్థులున్నారు. సాంస్కృతిక విప్లవం ముందుండే సంఖ్యతోపోలిస్తే యిది చాలా తక్కువ. అయితే ఉపాధ్యాయుల సంఖ్యలోమాత్రం అప్పటికీ యిప్పటికీ మార్పులేదు. అక్కడ 2,133 గురు ఉపాధ్యాయులున్నారు. అంటే యిప్పుడు విద్యార్థులు ఉపాధ్యాయులు యించు మించు సమంగా ఉన్నారన్నమాట. ఉదాహరణకి చరిత్ర విభాగంలో వందమంది అధ్యాపకులుంటే, విద్యార్థులు 128 మందే ఉన్నారు. ఇదంతా కొత్త పెకింగ్ యూనివర్సిటీ ప్రారంభదశ. ముందు ముందు ఎక్కువ విద్యార్థుల్ని చేర్చుకుంటారన్నది స్పష్టం.

ఈ మార్పులన్నీ షాంఘైలో మేముచూసినదానితో పోల్చిచూసేం. ఫుడాన్ (fudan) యూనివర్సిటీ అర్థశాస్త్రవిభాగంలో పనిచేసే యువతీయువకులతో చర్చించేం. వీరంతా ఫుడాన్‌లో చదువుకున్నవారే. వీరంతా పరిశోధనలుజరిపి కొత్తపాఠ్యపుస్తకాలు తయారుచేసే పనిలో నిమగ్నమై వున్నారు. కిందటేడు మొదటిసంవత్సరపు కోర్సుకి 1500 మందిని చేర్చుకున్నారనీ, ప్రస్తుతం రెండోసంవత్సరపు కోర్సుకి విద్యార్థుల్ని తీసుకుంటున్నారనీ చెప్పేరు. సాంస్కృతిక విప్లవానికి ముందు ఈ యూనివర్సిటీలో ఆరువేలమంది చదివేవారట. రెండో సంవత్సరపు కోర్సుకి బోధనాంశాలు యింకా తయారవుతున్నాయి. పెకింగ్ యూనివర్సిటీలాగే యిక్కడా విద్యార్థుల్ని చేర్చుకోడం పాఠ్యాంశాల నిర్ణయం ప్రారంభదశలోనే వుంది.

ఉదయంపూట క్లాసులకి హాజరయేం. విద్యార్థుల్లో కొద్దిమంది స్త్రీ పురుషులు సైనికదుస్తుల్లో ఉన్నారు. లైబ్రరీకి వెళ్తున్నప్పుడు అమాయకమైన మొహం, చురుకైన చూపులువున్న ఒక పొట్టిజడల అమ్మాయి కలిసింది. ఇస్త్రీలేకుండా ఉతికిఆరేసిన ప్రజావిమోచనసైన్యం దుస్తులు ధరించి ఉంది. మాతో ఇష్టాగోష్టిగా మాటాడుతూ

"బ్లాక్ పాంథర్ పార్టీ రెండుగా ఎందుకు చీలిపోయింది" అని ఆవిడ అకస్మాత్తుగా ప్రశ్నించింది. మేం దిగ్భ్రాంతిచెంది, "మీకు సరిగా వివరించలేమేమో" అన్నాం. ఈసంగతి మీకెలా తెలిసింది అని అడిగితే, వాళ్ళ లైబ్రరీలో ఇంగ్లీషుపత్రికలుంటాయనీ, తాను బ్లాక్ పాంథర్ పార్టీ పత్రిక చదువుతుంటాననీ చెప్పింది. మేము చెప్పిన సమాధానంతో ఆమె సందేహం తీరలేదు అయినా ఆవిషయంలో వివరాలు పోనీ తరువాత రాయగలరా అని అడిగింది. "స్త్రీల ఎర్రసైన్య విభాగం" (Red detachment of Women) అనే విప్లవ నృత్య ప్రదర్శనంలో లోపాలు, దానిపై మా అభిప్రాయం గురించి ఆమె అడిగింది.

ప్రజావిమోచనా సైన్యం దుస్తుల్లోవుంది, నిశితమైన రాజకీయ సందేహాలు వెలిబుచ్చే యీ కొత్తతరహా విద్యార్థులెవరు? యూనివర్సిటీకి రాకముందు వీరేంచేస్తుండేవారు? వీళ్ళని యూనివర్సిటీ చదువుకు ఎందుకు ఎన్నిక చేసేరు?

## యూనివర్సిటీలో ప్రవేశం :

మధ్యాహ్నం భోజనందగ్గర వృక్షశాస్త్ర విభాగంలోని ముగ్గురు యువవిద్యార్థినులు కలిసేరు. వారిలో ఒకామె 1967లో జూనియర్ మిడిల్‌స్కూలు పరీక్షపాసై, ప్రజావిమోచనా సైన్యంలో చేరింది. మిగిలిన యిద్దరూ 1964లో జూనియర్‌మిడిల్ స్కూలు (9వ గ్రేడు) చదువు పూర్తిచేసి, పెకింగ్ ఫ్యాక్టరీల్లో సాధారణ కార్మికులుగా చేరేరు. వీరి ముగ్గురి తండ్రులూ పెకింగ్ కార్మికులే. 1970 లో పెకింగ్ యూనివర్సిటీ తిరిగి ప్రారంభమైనప్పుడు, వీళ్లు వృక్షశాస్త్రం చదవడానికి మొదటి సంవత్సరం కోర్సుకు ఎన్నిక అయారు. వీరిప్పుడు గ్రామీణ ప్రాంతాల్లోపెంచే కూరగాయమొక్కలలో కొత్తరకాలను కనిపెట్టేందుకు కృషిచేస్తున్నారు. ప్రజావిమోచన సైన్యం నుంచి వచ్చిన యువతి యిప్పటికీ తీరికదొరికినప్పుడల్లా కవాతుకు శిక్షణకు వెళ్తూవుంటుంది. కొత్త యూనివర్సిటీలో మొదటిబట్టులోనే స్థానం లభించినందుకు వీళ్లు చాలా గర్విస్తున్నట్టు కనిపించారు. వాళ్ళ పనిగురించి చదువుగురించి చాలా ఉత్సాహంతో ఉద్వేగంగా మాటాడేరు.

సాంస్కృతిక విప్లవానికి పూర్వం, యూనివర్సిటీల్లో విద్యార్థుల్ని చేర్చుకోడానికి జరిగే జాతీయ ప్రవేశ పరీక్ష విధానం రద్దుచేసేరు. ఇప్పుడు, యూనివర్సిటీలో ప్రతి విభాగంలో ఎంతమందిని చేర్చుకునేదీ ముందుగా నిర్ణయిస్తారు. ఆ తర్వాత, యూనివర్సిటీకి విద్యార్థుల్ని ఎన్నికచేసే సంఘం (Admissions Committee) వివిధరాష్ట్రాలకు సీటుకోటా నిర్ణయిస్తుంది. ప్రతి రాష్ట్రంలోను ఒక ప్రత్యేక సంఘం ఆ రాష్ట్రి

కోటాను అక్కడి కర్మాగారాలు కమ్యూన్లు సైనికశాఖలమధ్య పంచుతుంది. వివిధభాగాల బలగాల అవసరాలు, రాష్ట్ర అవసరాలు దృష్టిలోవుంచుకుని ఈసంపకం జరుగుతుంది. కొన్ని విభాగాలకు ఒకటికన్న ఎక్కువసీట్లే లభించవచ్చు. ఉదాహరణకు ఒక్క షిన్-హు-వా (Hsinhua) ప్రింటింగ్ ప్రెస్‌నుంచే అయిదుగురు యూనివర్సిటీ విద్యకు ఎన్నిక అయేరు. వివిధ భాగాలకు సీట్లు కేటాయింపు నిశ్చయమయిన తర్వాత అక్కడి కార్మికుల్లో యూనివర్సిటీకి పోదలచినవారు దరఖాస్తులుపెట్టుకుంటారు ఆ విభాగంలో పనిచేసేవారందరూ కలసి ఎవరి దరఖాస్తు సిఫార్సుచెయ్యాలో నిర్ణయిస్తారు. ఈ విధంగా సిఫార్సు అయిన అభ్యర్థులు, యూనివర్సిటీ విద్యార్థి ఎన్నిక సంఘం ఆమోదంతో యూనివర్సిటీ ప్రవేశం పొందుతారు.

ఈ పద్ధతిలో ప్రవేశార్హతలకు సంబంధించి ఒక ముఖ్యమైన మార్పువుంది. ఇదివరలో కేవలం విద్యార్హతలుమాత్రమే చూసేవారు. ఇప్పుడు పనిపాట్లకు సంబంధించిన యితర అర్హతలుకూడా గమనిస్తున్నారు. పూర్వం అభ్యర్థులు చాలా క్లిష్టమైన పోటీపరీక్షలు వ్రాసవాల్సివుండేది. ఇప్పుడు యూనివర్సిటీలో చేరడానికి రాజకీయ అధ్యయనం, కర్షక కార్మికులతో సన్నిహిత సంబంధాలు అవసరం. కనీసం జూనియర్ మిడిల్‌స్కూలు గ్రేడ్యుయేటయి రెండు మూడు సంవత్సరాలు పనిశిక్షణగాని సైనికశిక్షణగాని పొంది ఉండాలి. ఆరోగ్యవంతుడై ఉండాలి. పాతతరానికి చెందిన అనుభవజ్ఞులైన కార్మికులు తప్ప, ప్రతివారు 20 సం వయసుగలవారై వుండాలి

మిడిల్‌స్కూలు చదువు పూర్తయినవెంటనే ఎవ్వరినీ నేరుగా యూనివర్సిటీలోకి చేర్చుకోరాదన్నది సాధారణ నియమం. కష్టజీవులతో ఎలాటి సంబంధాలు నెరపాలో నేర్చుకునేందుకు వారు ఫ్యాక్టరీల్లోను పొలాల్లోను సైన్యంలోను చాలాకాలం పనిచేస్తారు. అంతకన్న ముఖ్యంగా, దీనిద్వారా వారు సమాజం యెదుర్కొనే తక్షణ సమస్యలను స్వయంగా తెలుసుకుంటారు. ఈ సమస్యల పరిష్కారానికి అవసరమై శిక్షణపొందే కోర్కెతో వారు యూనివర్సిటీకి వస్తారు. సాంస్కృతిక విప్లవం ముందటి యూనివర్సిటీ విద్యార్థులకన్న వీరు ఎక్కువ పరిపక్వత, విస్తారమైన అనుభవం, నిర్దిష్టమైన దృక్పథం కలిగి వుంటారని ఆశిస్తున్నారు.

గణితశాస్త్ర విభాగంలో నలభై సం.ల వయసుగల ఒక కార్మిక విద్యార్థినికలిసేం. ఈయన ఉత్తరచైనాకు చెందినవారు. కుటుంబం-భార్య, యిద్దరు పిల్లలు-పెకింగ్‌లోనే వుండబట్టి ఆయన తరచు వాళ్ళను కలిసే అవకాశం లభించింది. కుటుంబం యితర ప్రాంతాల్లోవుంటే వాళ్ళను కలుసుకునేందుకు సంవత్సరంలో ఒకనెల సెలవుయిస్తారు. వయసు మళ్ళినతర్వాతకూడా ఇలా తిరిగి చదువుకునే అవకాశం కల్పించడం చైనాలో

ఒక ప్రధాన కార్యక్రమం. ఈ అవకాశం లభించినందుకు ఆయన చాలా సంతోషిస్తు న్నారు. చదువుకునే కాలంలో ఆయనకు యెప్పటిలాగే జీతం యిస్తారు. పెకింగ్ యూనివర్సిటీలో విద్యార్థుల కాలేజీ ఫీజు, పుస్తకాలు, నివాసం, భోజన వైద్య సదుపా యాలు సాదరు అన్ని ఖర్చులూ ప్రభుత్వమే భరిస్తుంది. కనీసం పదిసంవత్సరాలు ఫ్యాక్టరీలో పనిచేసి చదువులో చేరినవారికి వారిజీతంకూడా పూర్వంలాగే చెల్లిస్తారు.

వయసుమళ్ళిన కార్మికులు యూనివర్సిటీకి రావడమేకాదు, యూనివర్సిటీలే ఫ్యాక్టరీలకు తరలివెళ్ళే పద్ధతికూడా ఉంది. కొన్ని పెద్దఫ్యాక్టరీలు తమ సాధారణకార్మి కులకి మరింతగా సాంకేతిక శిక్షణ ఇవ్వడానికి స్వంతంగా కొన్ని ఉన్నతవిద్యాసంస్థల్ని ఏర్పరచుకొన్నాయి. ఇదేం కొత్తకాదు. కార్మికులు విరామసమయాల్లో చదువుకుందికి ప్రైమరీస్కూళ్లు, మిడిల్‌స్కూళ్లు కొన్నిఫ్యాక్టరీలు యిదివరకే ఏర్పాటుచేసేయి. యూని వర్సిటీ నడపడం యింకా పెద్దపని. అయితే, సాధారణ కార్మికుల్ని సాంకేతిక నిపు ణులుగా తయారుచేయగలగడం అంతకన్న ఉత్సాహవంతమైనది.

## విద్యాకాలం, పాఠ్యాంశాలు :

ప్రాథమిక మాధ్యమిక పాఠశాలల్లోలాగనే పెకింగ్ యూనివర్సిటీలోకూడా విద్యాకాలాన్ని తగ్గించేరు. సాంస్కృతిక విప్లవానికిముందు ఆర్ట్స్ గ్రూపులు అయిదు సంవత్సరాలు సైన్సుగ్రూపులు ఆరుసంవత్సరాలు చదివేవారు. ప్రస్తుతం పెకింగ్ యూనివర్సిటీలో కొత్తగా అమలవుతున్న ప్రయోగాత్మక ప్రణాళికలో యీ కోర్సులు రెండు మూడు సంవత్సరాలకు తగ్గించేరు. "అనవసరమైన పాఠ్యాంశాలు వదిలిపెట్ట డం. సమస్యల్ని పరిష్కరించగల నిజమైన విద్యావంతుల్ని వీలయినంత తక్కువ కాలంలో తయారుచేయండి" అన్నది రెడ్‌గార్డ్ లవినాదం.

బోధనా విషయాలు యించుమించు మునపటివలెనే ఉన్నాయి. ఆర్ట్సు, సైన్సు, భాషలు మూడు విభాగాలున్నాయి. ఆర్ట్సువిభాగంలో ఏడుశాఖలు : చైనా సాహిత్యం, చరిత్ర, తత్వశాస్త్రం, అంతర్జాతీయ రాజకీయాలు, అర్థశాస్త్రం, న్యాయశాస్త్రం, గ్రంథాలయ విజ్ఞానశాస్త్రం. సైన్సువిభాగంలో : గణితశాస్త్రం, భౌతికశాస్త్రం, రసా యనశాస్త్రం, వృక్షశాస్త్రం, భూగోళ, భూగర్భ శాస్త్రాలు, జియోఫిజిక్స్, రేడియో- ఎలక్ట్రానిక్స్ శాఖలున్నాయి. భాషావిభాగంలో మూడు ముఖ్యశాఖలున్నాయి. ప్రాచ్య భాషలు, పాశ్చాత్యభాషలు, రష్యన్ భాష.

మొదటి సంవత్సరంకోర్సులు- ముఖ్యంగా మావో ఆలోచనావిధానం, మార్క్సి జం గురించి చెప్పేవిగా- సాధారణంగా అందరికీ ఒకే తీరుగా వుంటాయి. రెండో సంవత్సరంలో విద్యార్థులు తమ తమ ప్రత్యేక విషయాలను (Subjects) మరింత

క్షుణ్ణంగా చదువుతారు. ఉదాహరణకి, చైనాసాహిత్యం అధ్యయనంచేసే విద్యార్థులు, వాళ్ళ రెండోసంవత్సరంలోనే సాంప్రదాయ సాహిత్యాన్ని ఎక్కువగా అధ్యయనం చేస్తారని ఒక టీచరు చెప్పేరు. ఈ సాంప్రదాయ సాహిత్య వారసత్వంనుంచి సృజనాత్మకంగా ఫలితాలు రాబట్టడం దుస్సాధ్యమే అయినప్పటికీ, సంపన్నమైన ప్రాచీన సారస్వతాన్నంతనూ అలక్ష్యం చేయలేమని ఆ టీచరు అన్నారు.

## అనుభవ జ్ఞానం :

ఏనాన్‌లోని జపాన్‌సామ్రాజ్యవాద వ్యతిరేక యూనివర్శిటీ "కాంగ్డా" (Kandge) గురించి పెకింగ్‌విద్యార్థులు టీచర్లు తరుచు చెప్పేవారు. వాయువ్యచైనాలో కొండలతో నిండిన ప్రదేశం ఏనాన్. ఇది కమ్యూనిస్ట్ పార్టీ కేంద్ర కార్యాలయంగావుంటూ 1937లో ప్రారంభమైన జపాన్ ఆక్రమణ వ్యతిరేక యుద్ధంలో ప్రముఖ పాత్ర వహించింది. ఆదశాబ్దం చివరలో చైనా నలుమూలలనుంచీ దేశభక్త ప్రేరితులైన యువజనులు ఎందరో యీ దుర్గమ కొండప్రాంతం చేరుకునేవారు. ఈ యువజనులకు పోరాటశిక్షణ యివ్వడానికి విద్యగరపడానికీ 1936 నుంచి 45 వరకూ కాంగ్డా యూనివర్శిటీ నడుపబడింది. ఈ కాంగ్డా యూనివర్శిటీ విద్యార్థులు వారికి కావల్సిన సౌకర్యాలన్నీ వారే సమకూర్చుకునేవారు. ఆర్థిక అవసరాల మూలంగా వారు యిలా చేయవలసివచ్చినా, దీనిద్వారా వారు స్వయంశక్తిమీద ఆధారపడడమే గాక ఆచరణలో ఆవశ్యకమైన పనితనాన్ని కూడా సంపాదించగలిగేరు. పుస్తకాలు చదువుకోడమేగాక, అక్కడి విద్యార్థులు సైనిక శిక్షణకూడా పొందేవారు. ఫ్యాక్టరీల్లోను పొలాల్లోను కూడా పనిచేసేవారు.

ఏనాన్ వెళ్లినప్పుడు అప్పటి చిత్రపటాలు కొన్ని చూసేం. ఒక బొమ్మలో, కొందరు విద్యార్థినులు, విద్యార్థులు రాట్నాలముందు కూర్చుని నూలు వడకడం నేర్చుకుంటున్నారు. ముగ్గురు రైతులు వారికి నూలు వడకడం నేర్పుతున్నారు. ఆ ప్రాంత ప్రజల సామాజిక జీవితం గురించి ఆ విద్యార్థులు ఎలా పరిశోధనలు సాగించిందీ, వారికి ఏవిధంగా రాజకీయాలను బోధించిందీ తెల్సుకున్నాము. సిద్ధాంతాన్ని ఆచరణతో జోడించాలనే మావో బోధనను వ్యవహారంగంలో మొదటిసారిగా ప్రయోగించింది ఈ యూనివర్శిటీలోనే.

కాంగ్డా యూనివర్శిటీ ఆదర్శం, పెకింగ్ యూనివర్శిటీనేగాక అనేక యితర స్కూళ్లనుకూడా పుస్తకాల చదువుతోపాటు ఆచరణకు తగిన స్థానం యిచ్చేలా ప్రోత్సహించింది. ఈ విధాన విజయాన్ని నెం. 31 పెకింగ్ మిడిల్‌స్కూల్లో కళ్లారాచూసేం. ఈ విధానం యూనివర్శిటీ స్థాయిలోకూడా విజయవంతంగా అమలుచేస్తున్నట్టు పెకింగ్ యూనివర్శిటీలో వివిధ శాఖలుచూస్తే తెలిసింది.

పెకింగ్ యూనివర్సిటీలో వున్న మందుల ఫ్యాక్టరీకి వెళ్లేం. ఆర్గానిక్, బయో కెమిస్ట్రీలలో ప్రత్యేక అధ్యయనం కొనసాగించే విద్యార్థులు యిక్కడ ప్రయోగాలు చేస్తూ కొత్త మందులు తయారుచేస్తున్నారు. అనేక పెద్దపెద్ద భాగాలతోసహా అక్కడి పరికరాలన్నీ విద్యార్థులు, టీచర్లు కలసి స్వయంగా తయారుచేసినవే. ఆ కర్మాగారం అత్యంత ఆధునికంగానూ స్వయం సంపూర్ణంగానూ వుంది. అందుకే ఆ ఫ్యాక్టరీ నడపడానికి ఉద్యోగులుగా నియమించబడ్డ కొద్దిమంది కార్మికులుకూడా అవసరమైనారు. విద్యార్థులు షిఫ్టులో పనిచేస్తూ నిత్యం అక్కడేవుంటారు విద్యార్థులు మత్తుమందులు, క్రిమిసంహారక మందులు, యిన్సులిన్, జీర్ణకోశంలో పురుగుల్ని సంహరించే మందులు తయారుచేస్తున్నారు. ఆ ఫ్యాక్టరీ ఆశయం విద్యార్థులకి శిక్షణ యివ్వడమే అయినప్పటికీ అక్కడ తయారైన మందులు యూనివర్సిటీబయట ప్రజలకు పంచడమే కాక, మార్కెట్‌లో విక్రయిస్తారు కూడా. ప్రజల జబ్బులు నయంచేసేందుకు స్వయంగా మందులు తయారు చేస్తున్నామనే తృప్తి విద్యార్థులకుంటుంది. పెకింగ్ ఫ్యాక్టరీల్లో పనిచేసే కార్మికులకు, రెండు మూడు వారాలపాటు రిఫ్రెషర్ కోర్సులుకూడా యిక్కడ నడుపుతారు. మేమా ఫ్యాక్టరీ సందర్శిస్తున్న సమయంలో, యిలా రెండువందల మంది కార్మికుల్ని ఒక కుదింపు కోర్సులో చేర్చుకున్నారు. చుట్టుపక్కల ప్రజలతో కలసి వారి సేవచేయడానికి యూనివర్సిటీ కిదొక సాధనం.

పెకింగ్ యూనివర్సిటీలో ప్రయోగ వ్యవసాయ కేంద్రంకూడా వుంది. వృక్షశాస్త్రం చదివే విద్యార్థులు ఫ్యాక్టరీలోకంటె యిక్కడ యెక్కువ కాలం పనిచేస్తారు. గత సంవత్సరంలో (1970) వీళ్లు మూడుసార్లు గ్రామీణ ప్రాంతాలకు వెళ్లేరు. 1970 ఆగష్టు నుంచి నవంబరు వరకు ఒకసారి, తర్వాత మరొకసారి నెల రోజులు, ఇంకొకసారి పదిరోజులు వీరు గ్రామీణ ప్రాంతాల్లో వ్యవసాయపు పనుల్లో పాల్గొన్నారు. యూనివర్సిటీలో చదువుకుంటున్న రోజుల్లో వారాని కొక పూట వాళ్ల శాఖకి సంబంధించిన కూరపెరళ్లలో పనిచేస్తారు. వ్యవసాయ రంగంలోని రెండు పెద్ద సమస్యలు, మొక్కలకుపట్టే తెగుళ్లు, వాటికి వచ్చే కొత్తరకం జబ్బుల గురించి వీరు తెలుసుకుంటున్నారు.

అర్ట్సు భాషా సాహిత్యాలు నేర్చుకునే విద్యార్థులకీ, ఆ శాఖల్లో టీచర్లకి తమ చదువుల్ని ఆచరణతో జోడించి సమాజావసరాలకి ప్రత్యక్షంగా వినియోగపడే మార్గం ఏదీ స్పష్టంగాలేదు. మావో ఆదేశాలు పాటించాలని వారికున్నా ఆచరణలో అది కష్టమయిపోయింది. ఉదాహరణకి 1964 లో మావో యిలా చెప్పేరు. "సాహిత్యం, చరిత్ర, అర్థశాస్త్రం, నవల మొదలైన కళలకి మనం వేరేవేరే ఫ్యాక్టరీలు పెట్టలేంకదా.

వీటిని అధ్యయనం చేసేవారికి సమాజం యావత్తూ కర్మాగారమే." అయితే, సమాజాన్నంతట్నీ కర్మాగారంగా ఉపయోగించడం ఎలా?

పెకింగ్‌లో ఫిబ్రవరి 7 "రోలింగ్ స్టాక్ ప్లాంట్" లో చైనా సాహిత్య విభాగం కృషి ఈ సమస్యాపరిష్కారంలో ఒక ప్రయత్నం. ఆ ఫ్యాక్టరీలో అనవసర దుబారాకు వృధాకు వ్యతిరేకంగా ప్రచారోద్యమం సాగుతున్నది. విద్యార్థులు ఈ ఉద్యమంలో పాల్గొన్నారు. సంక్షిప్తంగా విమర్శలు వ్యాఖ్యలు రాసేవారు. గతంలో జరిగిన పనిపాట్ల సమీక్షలు రాసేవారు. ఆదర్శ కార్మికుల్ని చిత్రించేవారు. వివిధ సాహిత్య ప్రక్రియల్లోను, భిన్నభిన్న శైలీరీతులతోను రాజకీయాల గురించి రాయడం, ప్రజలలో పెద్దఎత్తున రాజకీయ ప్రచారంచేయడం వీరు యిక్కడ నేర్చుకున్నారు. వాళ్ల ప్రత్యేక సబ్జక్టులలో శిక్షణకు యిది ఎంతో తోడ్పడింది. అంతేగాక, జనసామాన్యంలో బహుళ ప్రచారం పొందేలా ప్రజా సాహిత్యాన్ని రాసేందుకు వీరు ఫ్యాక్టరీకార్మికులకి పార్టీ కార్యకర్తలకి తోడ్పడ్డారు. మరోవారం తరవాత రోలింగ్ స్టాక్ ప్లాంట్‌కు వెళ్లినప్పుడు మాకు అలాటి ప్రజాసాహిత్యం కనబడింది. ఆ ఫ్యాక్టరీలో కార్మికులు, తామే స్వయంగా పద్యాలల్లి వర్క్‌షాప్ బ్లాక్‌బోర్డులమీద రంగుసుద్దతో రాసేరు.

ఆర్ట్సు శాఖల విద్యార్థులు, టీచర్లు ఈ ప్రయోగం ప్రయోజనకరమైనదే అని భావిస్తున్నారు కాని ఇతర శాఖలన్నిట్లోను ఆచరణనుంచి నేర్చుకోవాలనే సూత్రాన్ని ఎలా ప్రవేశపెట్టాలా అని తికమకపడుతున్నారు. గ్రంథాలయ శాస్త్ర విద్యార్థులు గ్రామీణ ప్రాంతాలలో సంచార గ్రంథాలయాలు చేయగలరు. చరిత్ర విద్యార్థులు ఈ శతాబ్దపు తొలిరోజులనాటి జీవిత విశేషాలను ప్రజల నుండి సేకరించి రికార్డుచేయవచ్చు. కాని, తత్త్వశాస్త్ర విద్యార్థులు ఏం చెయ్యాలి? బహుశా వాళ్లు చదివే విషయాలతో సంబంధం వున్నా లేకున్నా యూనివర్సిటీ నుంచి బయటకొచ్చి ఫ్యాక్టరీల్లోను పొలాల్లోను యితర కష్టజీవులతో కలిసి పనిచెయ్యడం ఒకటే మార్గమేమో! దీనివల్ల నిజమైన జీవితానుభవం కలిగి, వారికి విశాలమైన దృక్పథం ఏర్పడుతుంది. కేవలం పాఠ్యపుస్తకాల నుంచి విజ్ఞానం పొందిన సంకుచిత మేధావులుగాకాక, జీవితంతో సంబంధంగల పూర్ణమానవులుగా తయారు కాగలరు. ఇందుకోసమైనా వారు యూనివర్సిటీలు విడిచి సమాజంలో అడుగుపెట్టాలి.

### యూనివర్సిటీ పరిపాలన:

సాంస్కృతిక విప్లవానంతరం పెకింగ్ యూనివర్సిటీ నిర్వహణలో గొప్ప మార్పులు వచ్చేయి. ఇప్పుడు ప్రొఫెసర్లు విద్యాధికార్లు మాత్రమే నిర్వహణాధికార్లు కారు, సమాజంపట్ల విద్యాలయాల దృక్పథాన్ని నిర్ణయించేది విద్యాధికారులేనన్న అవ

గాహనతో పాత విద్యావిధానాన్ని రెడ్ గార్డులు పరిశీలించారు. సైనికులకి కార్మికులకి సమాజం పట్ల సరైన అవగాహన వుంటుందనీ, ప్రొఫెసర్లలో విప్లవోత్సాహం లోపిస్తుందనీ వీరు అభిప్రాయపడ్డారు. అందుచేతనే, యూనివర్సిటీని నిర్వహించే విప్లవ కమిటీలోను విద్యాలయాల రాజకీయ సమస్యలు పరిష్కరించే కమ్యూనిస్టుపార్టీ కమిటీలోను విద్యార్థులు ప్రజావిమోచనా సైన్య సభ్యులు కార్మికులే ముఖ్యపాత్ర వహిస్తారు.

పెకింగ్ యూనివర్సిటీలో రెడ్‌గార్డులోని విభిన్న గ్రూపులను సమన్వయంచేసి, అందరూ నూతన విద్యావిధానానికి దోహదంచేసే అనువైన వాతావరణం కల్పించేందుకు ప్రజా విమోచనా సైన్యం సభ్యులు, కార్మికులు మొదట్లో అక్కడికి వచ్చారు. పెకింగ్‌లోని పన్నెండు ఫ్యాక్టరీలకు చెందిన ఏడువందల మంది కార్మికులు వచ్చారు. ఇప్పుడు వందమంది మాత్రం ఉన్నారు.

ఆ తరువాత షింగ్‌హువా (Tsinghua) యూనివర్సిటీకి వెళ్లినప్పుడు, యూనివర్సిటీ నిర్వహణలో సైనికులు, కార్మికులపాత్ర ఏమిటని ప్రశ్నించేం. వాళ్లు యూనివర్సిటీల్లో ఎందుకుంటున్నారు? యూనివర్సిటీలో వారు చేయగలిగేదేమిటి?

నిర్దిష్ట సామాజిక రాజకీయ ఆర్థిక సమస్యల గురించి విద్యావేత్తలకన్న కార్మికులు, సైనికులకే ఎక్కువ తెలుసునన్నది సర్వసాధారణమైన జవాబు. సమాజావసరాలు వారికే సరిగా తెలుసు. యూనివర్సిటీలు సమాజ సేవకు అనుగుణంగా నడవాలంటే పరిపాలనలో వారు ఉండితీరాలి. విద్యాలయాల అధికారం విద్యావేత్తల సొత్తుగా ఉన్నన్నాళ్లూ కేవలం విద్యార్థులు టీచర్ల స్వార్థప్రయోజనాలు మాత్రమే నెరవేరేవి. వారి ప్రయోజనాల దృష్టి పుస్తకాలకు చదువులకు మాత్రమే పరిమితమై సంకుచితంగా వుండేది. సమాజం నుంచి దూరమై ఒంటరితనంలో వాళ్లు నేర్చుకున్న చదువులు సమాజపు అవసరాలకు కొరగాకుండా తక్షణ సమస్యల పరిష్కారంలో నిష్ఫలమయాయి. ఈ పరిస్థితి పునరావృతం కాకుండా వుండేందుకు కార్మికులు, ప్రజావిమోచనా సైన్యం సభ్యులు యూనివర్సిటీలలో వుంటున్నారు.

అయినా ఇక్కడ బోధించే విషయాలు కార్మికులకీ సైనికులకీ తెలియవు కదా, వారి పరిపాలనకు ఎలా తోడ్పడగలరని మా సందేహం. మొదట్లో కొందరు టీచర్లు విద్యార్థులుకూడా యిలాటి సందేహాలే వెలిబుచ్చేరుట. ప్రజావిమోచనాసైన్య రాజకీయోద్యోగిగావుంటూ, యూనివర్సిటీలో ప్రముఖపాత్ర నిర్వహిస్తున్న కామ్రేడ్ క్సీ (Xie) యిలా వివరించింది.

సాంస్కృతిక విప్లవం తరువాత విద్యావిప్లవాన్ని ప్రజావిమోచనసైన్య కార్మికులు కొనసాగించగలరా అని విద్యావేత్తలు ఎన్నో సందేహాలు వెలిబుచ్చేరు. "రాజకీయ సమ

స్యలు ఉత్పత్తి విషయాలు వారు పరిష్కరించవచ్చు కాని విద్యా విషయాలను వారు సంస్కరించలేరని భావించేరు. చాలామంది విద్యార్థులు, విద్యావేత్తలు "నౌకను వశపర్చుకోవడం ప్రజావిమోచనా సైన్యం పని అనీ అది నడపడం తమవంతు" అనీ అనేవారు. కాని నిజానికి ప్రజావిమోచనా సైన్యం కార్మికులు విద్యావిప్లవంలో కీలకపాత్రనే నిర్వహించారు. ఉదాహరణకి షింగ్‌హువా యూనివర్సిటీలో నీరు పదిలపరచే శాఖ విషయమే చూడవచ్చు. సాంస్కృతిక విప్లవానికి ముందు వీరు వాంగ్జియా యువాన్ రిజర్వాయర్‌కు ప్రణాళిక రచించేరు. రిజర్వాయరు తయారు కాకముందే ఈ ప్రణాళికా పాఠం అచ్చయింది. ఈ ప్రణాళిక రచించడంలో డిగ్రీ పేరు సంపాదించడమే వీరి ముఖ్యోద్దేశం. తీరా రిజర్వాయరు నిర్మించేక అది ఎందుకూ పనికిరానిదైంది. చూచి సంతోషించవల్సిందే తప్ప అందులో నీరు నిలవదని ఎగతాళిచేస్తూ రైతులు పాటలు కట్టేరు. గ్రామీణప్రాంతాల నీటిపారుదల అవసరాలు ఆచరణలో సాధ్యాసాధ్యాలు తెలియకపోవడమే యిటువంటి నిష్ఫలమైన పరిశోధనలకు దారితీసింది. ఇప్పుడు యూనివర్సిటీలో ఉన్న ప్రజావిమోచన దళానికి యీ శాఖకు సంబంధించిన శాస్త్ర పరిజ్ఞానం లేకపోవచ్చుగాని. గ్రామీణప్రాంత నీటిపారుదల అవసరాలు ఆచరణలో కష్ట నిష్ఠురాలు ఖచ్చితంగా తెలుసు. వీరు ఆ రిజర్వాయరు నమూనా అనవసరమైందని విమర్శ పెట్టేరు. ఈ అనుభవం తరువాత, ఈ శాఖవారు ఏపని తలపెట్టినా అది గ్రామీణ ప్రాంత అవసరాలను ఎంతవరకు తీర్చుతుందో ప్రత్యక్షంగా ఆ ప్రాంతంలో పరిశోధనలు చేసిగాని చేపట్టడంలేదు. అలాగే ఈ శాఖ విద్యార్థులు గ్రామీణ ప్రాంతాలకు వెళ్లి నీటిని భద్రించేసే విషయంలో రైతులకు పాఠాలు చెబుతున్నారు. దీని మూలంగా అవసరమైన ప్రాజెక్టులను రైతులే నిర్మించుకోగల్గుతున్నారు.

పెకింగ్ యూనివర్సిటీలో విద్యార్థులకు కూడా పరిపాలనాధికారాల్లో బాధ్యతాయుతమైన భాగం వుంది. విప్లవ కమిటీలు పార్టీ కమిటీలలో స్థానంతోబాటు వివిధ శాఖల సమస్యల పరిష్కారంలోకూడా విద్యార్థులకు తగినంత పాత్ర వుంది. ఉదాహరణకు తత్వశాస్త్ర శాఖలో మొదటి సంవత్సరం విద్యార్థులు వారి పాఠ్యాంశాల నిర్ణయంలో సాయపడ్డారు.

కొంత విముఖత ఉన్నప్పటికీ, విద్యార్థులు కార్మికులు సైనికులు యూనివర్సిటీ నిర్వహణలో తగిన పాత్ర సంపాదించగలిగేరు. సాంస్కృతిక విప్లవం పూర్వం ఈ అధికారమంతా విద్యావేత్తల సొత్తుగా వుండేది. ఇప్పుడు విద్యావిషయంలో సంబంధం గల సమాజంలోని అన్ని గ్రూపులతోనూ వారు అధికారాన్ని పంచుకోవల్సివచ్చింది. విద్యావిషయికమైన నిర్ణయాలలో తగిన స్థానాన్ని తమ హక్కుగా భావిస్తున్నారు విద్యార్థులు. యూనివర్సిటీలు సమాజానికి సేవచేయవలసినవనీ, ఆ సమాజ ప్రతినిధులుగా

యూనివర్సిటి పాలనను అందుకు అనుగుణంగా మలచడం తమ కర్తవ్యమనీ అందుకోసం యూనివర్సిటీల్లో తాము వుండితీరాలనీ ప్రజావిమోచన సైనికులు కార్మికులు భావిస్తున్నారు.

పెకింగ్ యూనివర్సిటీ చూచిన తర్వాత విద్యావిధానంలో 'కొత్తదనం' ఏమిటో మాకర్థమైంది. (1) ప్రవేశ విధానం. యూనివర్సిటిలో చేర్చుకునే ప్రతి విద్యార్థికి కనీసం రెండు సంవత్సరాల పని అనుభవం వుండాలన్న నిబంధన. (2) ఆచరణ ద్వారా నేర్చుకోవడం యొక్క ప్రాధాన్యత. విద్యార్థులు క్లాసురూం నుంచి బయటపడి నిజమైన సమస్యల పరిష్కారంలో పాల్గొనడంద్వారా, పరీక్షలు పాసయేసరికే సమాజంలో తక్షణ సమస్యలకు ఉపయోగపడే నిజమైన విజ్ఞానం పొందిన విద్యావంతులుగా తయారవడం దీని ఫలితం. (3) కొత్త పరిపాలనా విధానం. దీనిలో విద్యాధికారులు విద్యార్థులు, కార్మికులు, సైనికులతో తమ అధికారాల్ని బాధ్యతల్ని పంచుకుని విద్యాలయాల నిర్వహణ సమిష్టిగా కొనసాగిస్తారు.

ప్రైమరీ, మిడిల్‌స్కూళ్ళలోను యూనివర్సిటిలోను సాంస్కృతిక విప్లవం తరువాత ప్రవేశపెట్టిన విద్యాసంస్కరణలన్నీ ఒకే లక్ష్యంతో చేసినవి. తక్షణం సమాజానికి ఉపకరించగల విద్యావంతుల్ని, ముఖ్యంగా గ్రామీణాభివృద్ధికి తోడ్పడగల శిక్షణ పొందిన విద్యావంతుల్ని తయారుచేయడమే ఆ లక్ష్యం. బహుశా, అంత ప్రధానమైనదే మరో లక్ష్యం కూడా వుంది. విప్లవోత్సాహంతో సమాజ సేవకు అంకితమయే దృక్పథాన్ని విద్యార్థుల్లో పెంపొందించడమే యీ లక్ష్యం. కార్మిక కర్షక వర్గాలకు విస్తృత విద్యావకాశాలు కల్పించడం ద్వారా చైనా సమాజంలో సమానత్వం స్థాపించడం మూడో లక్ష్యం. ఇవన్నీ చాలా కష్టమైన గురుతరమైన లక్ష్యాలు. వీటిని సాధించడం చైనా ప్రజలకు కష్టసాధ్యమే కావచ్చు; కాని ఈ లక్ష్యాలదృష్ట్యా జాతీయ ప్రమాణాలు నిర్ణయించే ముందు ప్రాంతీయ వైవిధ్యాల్ని గమనంలోకి తీసుకొని స్థానిక విద్యాలయాల్లో విసుగుజెందకుండా వారు చేసే ప్రయోగాలు, కొత్త విధానాలు అమలు చేయడంలో వారి అప్రమత్తత చూసేక, ఈ లక్ష్యాలు చైనా సాధించితీరుతుందని నమ్మక తప్పదు.

## లెనిన్

మయకోవ్‌స్కీయ్

...లెనిన్ నేడులేడూ? చూడు
జనంలో ఉన్నాడు
లెనిన్ మన పరాక్రమం
కామ్రేడ్ లెనిన్ ఆయుధం
మన ఆసరా, మన జ్ఞానం.

★

...భూమికి చెందినవాడే
కాని తమ గాదెల్లో
ముక్కలు దాచుకునే
వాళ్ళవంటివాడుకాడు
అమాంతంగా భూగోళాన్నంతటినీ
తన సందిట్లోకి తీసుకున్నాడు
కాలంవెనుక దాగున్న
రహస్యాన్ని కనుక్కున్నాడు
ఏం?
నీలాంటి
నాలాంటివాడే అతను
నేస్తాలకోసం సున్నితమైన
ప్రేమ ఇస్తాడు
శత్రువులకు కఠోరలోహఖడ్గం!
మనలాగే అతడూ
అపజయాలూనిరాశలూ
ఎదుర్కొన్నాడు
అనారోగ్యంతో పోరాడాడు.

నిన్నటి మూగపావులను
వర్గసమరంలోకి నడిపించి
కార్మిక మానవ నియంతృత్వాన్ని
స్థాపించాడు
కారాగృహాలతో నిండిన
రాజధాని కోటలమీద!
...అతని ఒక్క చిన్న నిశ్వాసానికి
నాప్రాణాన్నే ఇచ్చేస్తాను
ఏం? నేనే అన్న మాటేమిటి!
ఇంతకూ ఎవణ్ణినేను?
అరవఖర్లేదాయన
ఒక్కసారి పెదవి కదిలిస్తేచాలు
మీలో ఎవరుమాత్రం
మీ గ్రామంనుంచి
మీ గనిలోంచి
మీ శరీర చర్మంలోంచి
ముందుకు దూసుకురారు?
...ఎక్కడనుంచి వచ్చాడు?
ఎవరాయన?
ఏం చేశాడు
మానవులందరికన్నా
మానవత్వంఉన్న
ఈ మనిషి.

## మే డే గీతాలు

పారిశ్రామికాధిపతులు
సుత్తపత్రికల సంపాదకులు
రుజాగ్రస్థ అజాగళ స్తనంలాటి
కార్మిక నాయకులు
స్వపర వంచన పరతంత్రులు
చేస్తున్నారు మే ఫస్టురోజు
ఫ్యాషనుగా శపథాలు
'ప్రపంచ కార్మికులంతా
ఏకం కండు'

బట్టలు నేసేవాళ్ళు
గుడ్డలు ఉతికేవాళ్ళు
చెట్లును గీసేవాళ్ళు
చెప్పులు కుట్టేవాళ్ళు
బుట్టలు అల్లేవాళ్ళు
కుండలు చేసేవాళ్ళు
పాలేరులు జాలరులు
ఇంటిల్లిపాదీ పనిచేసినా
ఒంటిపూట గడువని వాళ్ళు
అనాదిగా సమాజాన
అణచిఉంచ బడినవారు

ఏ కార్మిక శాసనాల
నమోదుకాబడినారు?

దౌర్భాగ్య దేశంలో
నిర్భాగ్యులు నిరుద్యోగులు
ఏ కార్మిక శాసనాల
నమోదుకాబడినారు?

చికాగో కార్మికులు
చిందించి రక్తం
పనిగంటలు తగ్గింపుకు
పోరాడిరి నాడు

నేడు
పనికోసం
మనుగడకోసం
మాత్రమె కాదు
మన రాజ్యం
శ్రామిక రాజ్యంకోసం
పీడితులంతా కలిసి
పోరాడకపోతే మేడే
చిగురించని మోడే.

— తమ్మ పెద్దిరాజు

అలలు అలలుగా
శవాలు శవాలు
మానవాకారాలు
దోపిడిలో
దౌర్జన్యంలో
నిరుద్యోగంలో
నిరుత్సాహంలో
శవాలు శవాలు
మానవాకారాలు
... ... ...
కెరటాలు కెరటాలుగా
విప్లవాలు, విప్లవాలు
మానవాకారాలు
దోపిడిపై
దౌర్జన్యంపై
స్వార్థంపై
పీడనపై
అరణ్యాల్లో
కొండల్లో, కోనల్లో
పట్టణాల్లో
విద్యాలయాల్లో
జైళ్లలోన, బైళ్లలోన
ఎగిసి దుముకు
కెరటాలు, కెరటాలు
మానవాకారాలు
... ... ...
ఈ సూర్యుడు ఉదయిస్తూనే
వున్నాడు ప్రతిరోజూ
పశ్చిమాన కుంకుతూనే
వున్నాడు ప్రతిరోజూ
మనిషి తిరగబడ్డాడు
గతంలోనూ.
... ... ...
ఈనాడీ సూర్యుడు
సెగలుకక్కే విప్లవ భానుడు
గతంమీద, మతంమీద
శిరచ్ఛేదం శాసనంపై
శ్రమజీవి స్వేదంపై
లేచినట్టి కొత్త మనిషి
పోరాటం గుణపాఠంగా
గతం ఒక అనుభవంగ
ఉదయించిన ఈ భానుడు
జగజ్జనుల కభిమానుడు
చివరివరకు మేల్కొంటు
విజయగీతి పాడుకొంటు
ఢిల్లీపై ఎర్రజెండ
ప్రతిగుండె అగ్నిమంట
విప్లవాన్ని పాడుకుంటు
శ్రమజీవుల కల్పవల్లి
పెకింగ్‌పై దృష్టిచల్లి
మానవతా గీతంగా
మార్క్సిజం వెలుగులోన
లెనినిజమే ఆచరణ
మావో నవ ఆలోచన

సమసమాజ నిజస్వర్గం
నీలోనూ, నాలోనూ
ప్రతి ప్రాణికి ప్రాణంగా
ఉదయగీత మాలపిస్తు
ఉక్కుడేగ ఎదనరికే
అదిగదిగో
భానూదయ
శ్రీకాకుళ గిరిజనదళం
నక్సల్‌బరి, ముషహరీలు
ప్రతి కిరణం ప్రజ్వరిల్లి
ప్రతిక్షణం వెలుగుమోసి
ఈ భూమికి శాశ్వతంగా
నవజ్యోతిని వెలిగించును
ప్రతిచోటా, ప్రతినోటా
ప్రజలంతా ప్రభంజనంలా
విప్లవాన్ని ఎలుగెత్తి
పోరాటం వెన్నుతట్టి
భుజం భుజం కలపిరండి
ఎదను ఎదను చేర్చరండి
రండి రండి సోదరులూ
రండి రండి పీడితులూ
కార్మికులూ, కర్షకులూ

అన్నార్తులు అబలలంత
ఉద్యోగపు వురి త్రాడుకు
వేళ్లాడే శాస్త్రజ్ఞులు
పాటమరచి బాటతప్పి
పయనించే కవులంతా
కలతచెంది, వ్యధనుపొంది
శ్రమజేసే ఉద్యోగులు
విద్యార్థులు నవయువకులు
అణగారిన ప్రజలందరు
ప్రతినోటా పలుకరండి
మేడే మన గీతమండి
శుభోదయం, నవోదయం
విప్లవజన మహోదయం
మేడే మన కాదర్శం
విశ్వమంత ఒక మేడే
విశ్వమంత శ్రామికరాజ్యం
విశ్వమంత ఎర్రజెండా
భవిష్యత్తు కనులనిండ
ప్రతినోటా పలుకరండి
మేడే మన గీతమండి.

- జ్యోతి

సోదర కార్మికులారా
చరిత్రకు కారకులారా!

అశేష ప్రజాప్రవాహం
విశేష ప్రాణ త్యాగం
రుద్రవీణ పిలుపివ్వగ
రక్తపుటేరులు పారగ
కాఠిన్య దురహంకారపు
కాల్వల గట్టులు తెంపుకు
నెత్తుట తడిసిన గుడ్డల
తమ గుర్తుగ ధ్వజమెత్తిరి-

కరుణమాలిన వానికి ఎదురుగ
అరుణ పతాకము ఎగురగ
బానిసత్వ శృంఖలాలు
బాసిన దీనాడే,
కార్మికుల పనిగంటలు
కొలిచిన దీనాడే,
నేడే
"మే-డే"

మాట మనిషి వేరైన
మానవత మనుగడ ఒకటేనని

పనివారితో ప్రపంచం
ప్రజ్వరిల్లి ప్రబలునని
నుడివిరి మార్క్సు-ఎంగెల్సు
నడిపిరి లెనిన్-స్టాలిన్

అదా చే తమ బాటగ
ఆచరించి జనచైనా
నాల్గోవంతు ప్రపంచం
నవలోకంగా మార్చెను
మావో ఆలోచనా విధానం
ప్రపంచ విప్లవ కేంద్రంగా
వియత్నామ్ కాంబోడియా
లావోస్
లావావలె రగుల్కొనెను
నక్సల్‌బరీ తెలంగాణ
శ్రీకాకుళ పోరాటం
భారత రైతాంగముక్తి
పోరాటం యీనాడు
మేడే అర్థం చెప్పును
పోరాడే యీనాడే మేడే.

కార్మిక ఐక్యత వర్ధిల్లాలి
ప్రపంచ కార్మికులారా ఏకంకండి!

- ఎన్. ఆర్. శేఖర్

కథ?

# విముక్తి

ఎం. ఎస్. రావు

అడవి రాజ్యం అధినేత పులిరాజుకు ముసలితనం వొచ్చింది. ప్రతి ప్రాణికీ జరామరణాలు సహజం ఐనట్టే పులిరాజుకు కూడ సహజమే.

కాని,

రోజురోజుకూ బలం క్షీణిస్తూ, దృష్టిమందగించిపోతూ, కండరాల బిగువుసడలి నరాలు పట్టుతప్పిపోతూ, ఒక్కొక్కటి చొప్పున పళ్లు, కోరలు ఊడిపోతూ, క్రమంగా తనకు ముసలితనం రావడం పులిరాజుకు అసహనంగానే తోచింది. అన్యాయంగా అధర్మంగా కూడ తోచింది.

ఏం తోచినా ఏం తోచకున్నా వాస్తవం వాస్తవమే. పులిరాజు కొన్నాళ్లలోనే వాస్తవాన్ని గ్రహించవలసి వచ్చింది. తాను ముసలిదయింది. తన ఆకలి మాత్రం ముసల్దికాలేదు. తన ఆశలు, కోరికలు ఏవీ ముసలివి కాలేదు. ముసలిదయిన శరీరానికి ముసలివికాని ఆకల్ని, ఆశల్ని, కోరికల్ని సంతృప్తిపరచే శక్తి క్షీణించింది. అడవి రాజ్యంలోని అన్ని జంతువులకూ తమతమ సహజగుణాల్తోపాటు పులిరాజు సహజగుణం కూడ తెలుసు. తమ రక్తం వేడి తమకు తెలీదుగాని, అవి తెలిసిన పులిరాజు పంజాదెబ్బ బలం, కోరలవాడి గాగా తెలుసు వాటికి. ఇన్ని తెలిసిన అడవి జంతువులు తమకు తాముగా తన నోటి ముందుకొచ్చి తిని త్రేన్చమని వేడుకుంటాయన్న భ్రమ పులిరాజుకు ఏమాత్రమూ లేదు. తాను కొద్ది నెలల్లోనో, కొన్ని సంవత్సరాల్లోనో చచ్చిపోతుంది. అది తప్పదు. ఈలోగా తాను స్వతహాగా వేటాడి ఆహారాన్ని సంపాదించుకోలేదు. త్వరగా, అతి త్వరగా ముసలితనం వచ్చేసింది– వచ్చేసింది.

మరి ఎలాగ? తాను బ్రతికేదెలాగ? తన రాజరికం నిలిచేదెలాగ?

అడవి రాజ్యాధిపతికి చావుతెలివిలో అమోఘమైన అసాధారణమైన ఉపాయం తోచింది.

* * *

'మిత్రమా!'

బీద బ్రాహ్మడు ఆశ్చర్యపోయేడు. ఈ అడవిలో అంత సౌమ్యంగా, స్నేహంగా తనను పిలుస్తున్న దెవ్వరు?

'ద్విజోత్తమా, ఓ పుణ్యాత్ముడా'

ఎక్కణ్ణించా పిలుపు? — వెర్రి బ్రాహ్మడు ముందుకు చూచాడు. వెనక్కు చూచాడు.

'మిత్రమా అటు కాదు, యిటు'

పిలుపు వినిపించిన వైపు రెండడుగులు వేశాడు.

అక్కడ

భయమూ ఆశ్చర్యమూ ఉక్కిరి బిక్కిరి చేయగా బ్రాహ్మడికి ముచ్చెమటలు పోశాయి.

'భయపడుతున్నావా మిత్రమా'

మెడలో రుద్రాక్షమాల. నుదుట విబూదిరేఖలు. కళ్లలో కారుణ్యం. కుడి చేతిలో తళతళమెరిసే వజ్రపుటుంగరం. చుట్టూ చిన్న బురదగుంట. బురదగుంటలో మోకాలిలోతున మహర్షిలా పులిరాజు.

బాధగా వేదాంతి నవ్వు నవ్వింది.

'నన్నుచూసి నువ్వు భయపడడం సహజం. నేను పులిని, నువ్వు మనిషివి. పులి జన్మమెత్తి నేను పాపినయ్యాను. మనిషి జన్మమెత్తి ద్విజుడవై నువ్వు పుణ్యాత్ముడ వయ్యావు. భగవంతుని లీలలు ఎంత విచిత్రమైనవి! కాని ఓ సత్పురుషా— పులిగా పుట్టటమే నా పాపమైతే ఆ పాపాన్ని కడిగేసుకోవడానికి నేను సిద్ధంగా వున్నాను.'

బాపడికి నోట మాట రాలేదు.

'ఇంకా నమ్మకం కలగలేదా? చూడు యీ వుంగరం. అద్భుతమైన శక్తులు గలది. నేనుచేసిన సేవలను మెచ్చి సిద్ధుడొకడు యీ వుంగరాన్ని నా పాపపు జన్మకు ప్రాయశ్చిత్తంగా నాకిచ్చారు. ఆనాటి నుంచి జీవహింసను త్యజించి కందమూలాలు మాత్రమే భుజిస్తూ నియమనిష్ఠల్తో బ్రతుకును వెళ్లమారుస్తూ నీలాంటి మహానుభావుని కొరకు ఎదురు చూస్తున్నాను. ఈ వుంగరాన్ని నీకు సమర్పించుకొని నా శాపంలాంటి పాపం నుండి విముక్తమౌతాను.'

'బె బె బె—' అన్నాడు బొర్రైనాలేవి బక్క బ్రాహ్మడు.

'నీ కష్టాలు నేనూహించగలను. ఇది కలియుగం. ఎక్కడచూసినా పాపం-పాపమే రాజ్యం చేస్తున్నది. ఉచ్చనీచాలు నశించాయి. కులమతాలు మంటగలిశాయి. ప్రజల్లో భయభక్తులు ఏకోశానాలేవు. నాస్తికులు ఎక్కువై భగవంతుని సింహాసనాన్ని

పెకిలించివేయాలని చూస్తున్నారు. ఒక్కసారి జ్ఞాపకంచేసుకో. గతకాలం మీ బ్రాహ్మల వైభవ ప్రాభవాలు ఎంత గొప్పగా వుండేవి! రాజ్యాలు రాజులు మీ చేతుల్లో. భక్తి రక్తి మీ చేతుల్లో. ధనధాన్యాలు వజ్రవైడూర్యాలు. లక్ష్మీ సరస్వతులు మీ ఇళ్లల్లో. కాని ఇప్పుడేముంది? మీకేమి మిగిలింది?'

'ఈ వుంగరం తీసుకెళ్లు. రోజూ స్నానాదికాలు ముగించాక పూజించు. నీవు కోరుకున్నది ఇస్తుంది. డబ్బు ఇస్తుంది. ధాన్యం ఇస్తుంది. బంగళాలనిస్తుంది. పట్టు పరుపుల్ని పడుచు పిల్లల్ని– ఏది కావాలంటే అది యిస్తుంది. నీకందరూ విధేయు లౌతారు. మిత్రులంతా నీ ఇంటిచుట్టూ కుక్కల్లా తిరుగుతారు. అంతా నీకు చేతులెత్తి మొక్కుతారు. నీ పూర్వప్రాభవ తిరిగి వొస్తుంది.'

'నిజంగానా!' అన్నాడు బ్రాహ్మడు.

'నిజం మిత్రమా నిజం. నీకింకా నమ్మకం కలుగలేదా?'

'ఐతే–'

'సందేహ మెందుకు? ఇదిగో ఉంగరం తీసుకువెళ్లు. నన్ను కృతార్థున్నిచేయి.'

ఇంతటితో తన జన్మజన్మల దరిద్రం తీరుతుందనుకున్నాడు బ్రాహ్మడు. నిజం గానే తీరిందికూడ.

ఉంగరం అందుకోడానికి బురదలో దిగేడు. దిగి చేయి చాచాడు ఉంగరం కొరకు. పులిరాజు ఉంగరం ఇవ్వలేదు సరికదా గట్టిగా గర్జించి పంజాయెత్తి ఒక్క దెబ్బతీసింది. ఆ ఒక్కదెబ్బతో నవనాడులూ తెగిపోయి దిమ్మతిరిగిన బ్రాహ్మడు జరిగిన మోసం గ్రహించాడు. భయంతో అరుస్తూ బురదలోంచి పులిరాజు రెండో దెబ్బనించి పారిపో ప్రయత్నించాడు. కాని బురదలో కూరుకుపోయిన కాళ్లు వస్తేగా.

అప్పటికే ఆలస్యమయింది. అలా బురదలో కూరుకుపోయిన బ్రాహ్మడు చక్కా పులిరాజు కడుపులో తేలాడు.

. . .

'మిత్రమా!'

చిరుద్యోగి అటు వెళ్లాడు.

బురుగులో పులిరాజు. పులిరాజు చేతిలో వజ్రపుటుంగరం. అంతా మామూలే.

చిరుద్యోగి భయపడ్డాడు మొదట. ఆశ్చర్యపోయాడు తర్వాత. ఆ తర్వాత పులిరాజు మాటల గారడీలో చిత్తైపోయాడు.

'నీకొరకే ఎదురుచూస్తున్నాను మిత్రమా నీకొరకే. నీకు రెండేళ్ల ఇంక్రిమెంటు రావాలి కదూ. కాదూ, మూడేళ్లదా. ఆ మూడేళ్ల ఇంక్రిమెంటూ యిప్పిస్తుందీ ఉంగరం. దీని ప్రభావంవల్ల ఆగిపోయిన ప్రమోషన్ వొస్తుంది. నిన్ను చూస్తూనే మండిపడే ఆఫీసర్ ప్రసన్నుడౌతాడు. పాడిగేదెలాంటి సెక్షన్ దొరుకుతుంది. మూడేళ్ల కింద నీ పెద్దబిడ్డను వదిలేసిన నీ అల్లుడు ఆమెను తిరిగి ఏలుకుంటాడు. ఎదిగి కూర్చున్న నీ మిగతా ఇద్దరు బిడ్డలకూ మంచి సంబంధాలు దొరుకుతాయి. బియ్యేపాసై ఉద్యోగం దొరక్క ఎండ్రిన్ తాగి చచ్చిపోవాలనుకుంటున్న నీ కొడుక్కు మంచి ఉద్యోగం వస్తుంది. స్వంతిల్లు కట్టుకుంటావు. దానాలు చేస్తావు. నవ్వ గలుగుతావు. నవ్వించ గలుగుతావు— ఇవన్నీ ఇచ్చే యీ వుంగరాన్ని నీ కొరకే దాచివుంచాను. తీసుకువెళ్లు. నన్ను నా పాపం నుండి విముక్తి చేయి.'

• • •

'బ్రదర్!'

నిరాశా నిస్పృహల్తో కుంగిపోయి కాళ్లకు అరిగిన చెప్పులుకూడ లేని నిరుద్యోగి 'నన్నెవరు పిలుస్తారూ యీ అడవిలో యింత స్నేహంగా!' అని అనుకుంటూ అటు వెళ్లి మృగరాజును చూసినవాడై, భయపడినవాడై, ఆశ్చర్యపోయినవాడై వుండగా— సానుభూతి నిండివున్న గొంతుతో పులిరాజిలా అంది.

ఆ చంకనవున్న కాగితాలకట్ట ఏమిటి బ్రదర్? సర్టిఫికెట్లా. బియ్యే యూనివ ర్సిటీ ఫస్టుగా పాసయ్యావా. రెండేళ్లనుంచి కాలికి బట్టకట్టకుండా తిరుగుతున్నావా. ఎన్ని ఇంటర్వ్యూలకు అటెండయావు? ఇరవై తొమ్మిదింటికా. ఒక్క ఉద్యోగమూ దొరకలేదా ఏమంటున్నావు— నీకు రెకమండేషన్ లేదా. లంచాలిచ్చే స్తోమతకూడ లేదా. అన్యాయమంటున్నావా. ఈ ప్రపంచమంతా మోసం దగా అంటున్నావా. ముసలి తలిదండ్రిలూ, ముండమోసిన అక్కా, వయసు చెల్లె నీపైన ఆధారపడివున్నా రంటున్నావా. అప్పులుకూడ వున్నయ్యా. ఇల్లు వేలం వేస్తారా. ఎప్పుడు? వచ్చే పదిహేనో తారీకున్నా. చచ్చిపోవాలనుకుంటున్నావా. బతికి సాధించేదేముందంటు న్నావా. తప్పు బ్రదర్ తప్పు. నిరాశకూడదు. ఎవరికెప్పుడే అదృష్టం కలిసి వస్తుందో చెప్పలేము. నిన్ను చూస్తుంటే ఈ ఉంగరం నీకే యివ్వాలనుంది. తీసుకెళ్లు మన యోగుల మహర్షుల మహత్తు నీకు తెలుసుకదా, విషాన్ని జీర్ణించుకుంటారు. నిప్పులమీద నడిచి నీటిమీద పరుంటారు. చిటికెడు విబూదితో కోరికలన్నీ తీర్చుతారు. ఆలాంటి సిద్ధుడు ఇచ్చిందే ఈవుంగరం. దీనివల్ల నీకు గొప్ప, అతిగొప్ప ఉద్యోగం దొరుకుతుంది. నీ కష్టాలన్నీ ఈడేరుతాయి. పైగా ఇతరుల కష్టాలుకూడ తీర్చగల్గు

తావు. ఈ వుంగరాన్ని తీసుకువెళ్ళి నేనో మంచిపని చేశానన్న సంతృప్తినైనా నాకు మిగుల్చు ...

జీవితంమీద తిరిగి చిగురించిన మమకారం మెరుస్తోన్న కళ్ళతో ఉంగరం తీసుకోవడానికి వొచ్చిన నిరుద్యోగిని తినేసి నిండినకడుపుతో సంతృప్తిగా తేన్చింది పులిరాజు.

* * *

'చెల్లెమ్మా'

చెల్లెమ్మా అని పిలువబడిన దుఃఖాతురయైన ఆ గృహిణి పులిరాజును ఆరూపంలో చూసేసరికి మొదట భయపడి, తర్వాత ఎవరో దేవత ఆ రూపంలో తన ముందు ప్రత్యక్షమైనదని నమ్మినదై భక్తిప్రపత్తులు ఇనుమడింప చేతులు జోడించింది :

అప్పుడు మృగరాజు నిజమైన దేవతలా కాకుండా ఆదేవత పంపిన ప్రతినిధిలా ఇలా అంది

'నిన్ను చూస్తే నాకడుపు తరుక్కుపోతుంది చెల్లెమ్మా. నువ్వు నీ పనికిమాలిన—కాదుకాదు, కోపానికిలాకు— దైవసమానుడైన నీ భర్తతో పోట్లాడి పిల్లల్ని అక్కడే వదిలేసి తల్లిగారింటికి వెళ్తున్నావని నాకు తెలుసు. నీ భర్త మంచివాడేననీ, నీ అత్తామామా అంతా మంచివారేననీ, నువ్వు అతిమంచిదానవనీ తెలుసు. పాడువిధి ఇంత మంచిదానవైన నీపట్ల వక్రించిందనీ, ఒకానొకప్పుడు దేవుడుకూడ విధిచేతిలో కీలుబొమ్మేననీకూడ నాకు తెలుసు. మనమంతా మంచివాళ్ళమే. దేవుడుకూడ మంచివాడే. కాని దారిద్ర్యం బహు చెడ్డది. విధి ఇంకా చెడ్డది. ఈరోజులు మరీ మరీ చెడ్డవి. అందుకని చెల్లెమ్మా దుఃఖపడకూడదు. అధైర్యపడగూడదు. ఇది నీకూతెలుసు. కాని నీకు తెలీని ఓ విషయం నాకు తెలుసు అదేమిటంటే— ఈ వుంగరం మహిమ.'

గృహిణి కళ్ల విప్పార్చి తళతళా మెరుస్తోన్న ఆ వుంగరాన్ని చూసింది.

'నువ్వు నా తోబుట్టువు లాంటిదానివి తన తోబుట్టువు కష్టాల్లో వున్నదంటే ఏ అన్నయ్యైనా చూస్తూ ఊరోర్కగలడా ? ఈ వుంగరం నీకిస్తున్నాను తీసుకువెళ్లు. దేవుని పటంముందు పెట్టి రోజూ కుంకుమా పూలూ వేసి పూజించు. నీ కోరికలన్నీ ఈడేరుతాయి. దారిద్ర్యం నీ జోలికిరాదు. అప్పుడు బజార్లోకి వచ్చిన కొత్త చీరల్లా కొనేస్తావు. గంటకొక్క చీర మారుస్తావు. నగలవర్తకులదగ్గర మంచిమంచి నగలన్నీ నీ శరీరం మీదుంటాయి. నువ్వు హీరోయిన్‌లా నీభర్త హీరోలా చుట్టుపక్కల గృహిణులకు కన్నుకుట్టేలా అందంగా ఆనందంగా ఖుషిఖుషీగా వుంటారు. నువ్వు కథలు రాస్తావు. నీ నవలకు ఫస్టు ప్రైజులొస్తాయి నీ సీరియల్స్‌తో వార, మాస పత్రిక

లన్నీ సర్క్యులేషన్‌ని పెంచుకుంటాయి. నీ కథల్ని సినిమాలు తీస్తారు. అవి ఒక్కోటి యాభై వారాలపైగా ఆడతాయి. నువ్వింకా నోములు నోస్తావు. వ్రతాలు చేస్తావు. నీ కొడుకుల పుట్టువెంట్రుకలు తిరుపతిలో తీయిస్తావు. నీ బిడ్డల చెవులు కాశీలో కుట్టిస్తావు.... ।'

గృహిణి తన్మయత్వంలో ఊగిపోయింది. తనకా వరాలన్నీ యిచ్చే ఉంగరం తీసుకోవడానికి దేవునిదగ్గరకు వెళ్లినట్లు మృగరాజు దగ్గరికి వెళ్తూ బుడుగులో దిగింది. ఆవిధంగా పులిరాజుకు ఆడకూతురు మాంసం దొరికింది. ఆరోజు ఆకలి తీరింది.

• • •

'కామ్రేడ్ ।'

'నిన్ను నమ్మను నేను' అరిచాడు కార్మికుడు.

'కాని నిన్ను నేను నమ్ముతాను' అంది పులిరాజు. 'ఈ ఆధునిక యుగంలో నీ పాత్రని నేను నమ్ముతాను. నీ ప్రాముఖ్యాన్ని, నీ సేవను, నీ శక్తిని నేను బాగా నమ్ముతాను. నీ భవిష్యత్తుపట్ల ఎవరికీ లేని నమ్మకం నాకుంది. కామ్రేడ్ ఈ దేశం నీది. ఈ సంపద నీది. ఈ ప్రపంచానికి నువ్వే అసలు సృష్టికర్తవు. కాని నువ్వీ రోజు దారుణంగా దోపిడీ చేయబడుతున్నావు. నీ కష్టాన్ని మేపి గుత్తపెట్టుబడిదారులు తెగ బలుస్తున్నారు. నువ్వు తెగించి సమ్మెచేస్తే నీపైకి గుండాల్ని పంపిస్తున్నారు. నీదైన నీదేశంలోనే నీకు ఇల్లు లేదు. చదువులేదు. వైద్యంలేదు. రక్షణలేదు. సమ్మె కట్టే స్వతంత్రం కూడలేదు. మరి ఉన్నదేమిటి? సంకెళ్లు, సంకెళ్లు. అందుకని— అందుకనే కామ్రేడ్ ! నీ చేతుల్లోకి రాజ్యాధికారం రావాలి. వచ్చి తీరుతుందని భగవంతుడు గీతలో చెప్పేడు. మన దేశనాయకులు వెయ్యిన్నొక్కసార్లు అక్కడ యిక్కడ అనకుండా అంతటా చెప్పారు.'

ఏ ట్రేడ్‌యూనియన్ లీడరూ ఇంతగొప్పగా మాట్లాడగా వినలేదు కార్మికుడు. అప్రతిభుడై వినసాగాడు పులిరాజు మాటలు.

మరి రాజ్యాధికారం నీ చేతికెలా వస్తుంది? తెలీదా. స్ట్రైకులేచేయడం మాత్రమే తెలుసా. మీ నాయకులు రాజ్యాధికారం వచ్చితీరుతుందని చెప్పారు కాని, ఎలా వస్తుందో, అందుకు నువ్వేంచేయాలో చెప్పలేదా, నేను చెబుతాను విను. ఈ ఉంగరంద్వారా వస్తుంది నీకు రాజ్యాధికారం, ఆశ్చర్యపోతున్నావా. నిజంకామ్రేడ్ నిజం. ఈ ఉంగరంవల్ల నీవు పెద్ద ట్రేడ్‌యూనియన్ లీడర్‌వవుతావు. తర్వాత రాష్ట్ర కార్మికమంత్రివవుతావు. అక్కణ్ణించి ముఖ్యమంత్రి, చివరకు ప్రధానమంత్రివై రాజ్యాధికారాన్నంతా చేజిక్కించుకుంటావు. కార్మిక శ్రేయోరాజ్యాన్ని నెలకొల్పుతావు,

'నిజంగానా' అన్నాడు కార్మికుడు.

'నిజమే'నంది పులిరాజు.

కార్మిక శ్రేయోరాజ్యాన్ని తేగలిగే మహత్తుకలిగిన ఉంగరాన్ని అడుక్కునేందుకై వెళ్ళిన కార్మికుడి రక్తం వేడి పులిరాజుకు చాలా హుషారు కలిగించింది.

* * *

తర్వాత

ఒకరోజు ఇలాగే ఆ వుంగరాన్ని చూపించే పులిరాజు రైతును స్వాహా చేసింది. మరోరోజు విద్యార్థిని భోంచేసింది. తర్వాత ఓరోజు గిరిజనుణ్ని నఫాచేసింది. హరిజనుణ్ని నఫాచేసింది. ఇంకోరోజు ఇంకొకర్ని— ఇలాగ ఎన్నోరోజులు ఎంతోమందిని మింగేసింది.

పులిరాజు తినగా మిగిలిన ఎముకల్ని నక్కలు, రాబందులు సమంగా పంచుకుని పీక్కుతినేవి. చివరికి మిగిలిన ఎముకల్ని ఆ బురదగుంటలోనే పైకి కనిపించకుండా తొక్కేసేవి.

* * *

ఆరోజు—

సూర్యుడు ఉదయించిన కొద్దిసేపటికే చండప్రచండంగా మారేడు. వసంత ఋతువు అడవినంతా చిగురుటాకుల్తో చిరుగాలుల్తో, రంగురంగుల పూలతో పళ్ళతో అలంకరించి కొత్తయుగానికి స్వాగతమిచ్చేందుకు తయారైనట్లుగావుంది

అప్పుడు

ఆకలితో మండిపోతున్న పులిరాజు ముందుకు అతడు వచ్చాడు.

అతనిరాక పులిరాజుకు ఎంతో సంతోషాన్ని కలిగించింది. ఎందుకనో పులిరాజుకీమధ్య రోజురోజుకూ రక్తదాహం హెచ్చుతున్నదేగాని తగ్గడంలేదు.

'రా—రా నీకొరకే ఎదురుచూస్తున్నాను' అంది.

'నేను నీకొరకే వచ్చాను. నీగురించి వినేవచ్చాను' అన్నాడు అతడు,

పులిరాజు మనసుగుండెలో ఏమూలలోనో భయం పుట్టింది అతని మాటలు వింటూంటే. ఐనా మానవమాత్రునికి తను భయపడడమా !

మామూలుగా మాట్లాడడానికి ప్రయత్నిస్తూ పులిరాజు అడిగింది. 'అలాగా. నా గురించి ఎవరు చెప్పారు నీకు '

'ప్రతి ఒక్కరూ చెప్పారు. చిన్నా పెద్దా ముసలీ ముతకా ఆడామగా అందరూ చెప్పారు. ఈ భూమిమీది ప్రతిజీవీ చెప్పింది. చిన్న మట్టి అణువు, అతిపెద్దపర్వతం,

చెట్లు చేమలు, అడవులు, నదులు, సూర్యచంద్రులు, ఆకాశం, సముద్రాలు— అన్నీ నీగురించే మాట్లాడుకుంటున్నాయి.'

అతని నిర్భయత్వాన్ని చూస్తుంటే, అతని కళ్ళలోని మెరుపుల్ని చూస్తుంటే, అతని మాటల్లోని ఆత్మవిశ్వాసం ఆవేశాల్ని చూస్తుంటే పులిరాజుకు తానిదివరకెన్నడూ చూడని తానెరగని ఒక కొత్తమనిషిని, అతి బలవంతుణ్ని, తన అసలు శత్రువును చూసినట్లుగా ఫీలయింది.

'మరి నువ్వెవరు?' ధైర్యంగా ఉండడానికి ప్రయత్నిస్తూ అడిగింది.

'నేనా?' అతడు చిన్నగా, గర్వంగా నవ్వాడు. 'నేను విప్లవకారుణ్ని. పీడిత ప్రపంచానికి విముక్తి ప్రదాతను. నువ్వు తినేసిన చిరుద్యోగి మాతండ్రి. నిరుద్యోగి మా అన్న. కార్మికుడు మా చిన్నాన్న. గృహిణి మా వదిన. రైతు మా పెదనాన్న. విద్యార్థి నా తమ్ముడు. గిరిజన, హరిజనులు నా నేస్తాలు. నేను విప్లవకారుణ్ణి'

'విప్లవకారునివా? మంచిది మంచిది. ఐతే నువ్వు యీ వజ్రపుటుంగరం గురించి వినేవుంటావు.'

'విన్నాను. నీ వజ్రపుటుంగరం గురించి బాగా విన్నాను. దాని ఆశ చూపి ఎందరెందర్ని బురదగుంటలోకి లాగి మట్టుపెట్టావో అంతా విన్నాను. విన్నానుకాబట్టే యిక్కడికి వచ్చాను. ఇక నీ ఆటలు సాగవు. ఇంతటితో నీ ఆటకట్టు.'

ఉంగరం మంత్రం పారలేదు। ఫెయిలయింది. పులిరాజు శరీరం ఒక క్షణం వణవణా వణికింది. అలా పులిరాజు ఎన్నడూ ఎవరిముందూ ఏ పరిస్థితుల్లోనూ వణికి పోలేదు. ఐనా మరుక్షణంలోనే ధైర్యాన్ని, బలాన్ని కూడదీసుకుంది. అడవంతా దద్దరిల్లేటట్లు గర్జించింది.

'గుడ్డొచ్చి పిల్లనెక్కిరించినట్లు ఎగిరెగిరి పడుతున్నావే? నువ్వెవరిముందు నించుని మాట్లాడుతున్నావో తెలుసుకునే మాట్లాడుతున్నావా? ఒక్క పంజాదెబ్బతో నీ నవ్వులన్నీ ఎగిరిపోతాయి. నా కోరలమధ్య చిక్కుకుని నీ శరీరం నుగ్గునూచమై పోతుంది. ఏదో పాపం పోనీ అని సహాయం చేయదలచుకుంటే చిన్నా పెద్దా మరచి మిడిసిపడుతున్నావే. జాగ్రత్త.'

'అలాగా' అన్నాడు అతడు. అని భుజానవున్న తుపాకీ తీసేడు.

తుపాకీచూసి పులిరాజు అదిరిపడింది. ఇంతవరకూ పులిరాజుదృష్టి దానిపైకి వెళ్ళనేలేదు. తన చురకత్తి చూపుకేమయింది? తన స్ఫూర్తి ఎప్పుడుచచ్చిపోయింది?

అతడు తుపాకీ లోడ్‌చేస్తున్నాడు తనవైపే చూస్తూ. సమయం మించిపోతు న్నది. అవకాశాన్ని తన పంజావించి జారిపోనివ్వకూడదు. త్వరగా అతిత్వరగా దెబ్బతీయాలి.

పులిరాజా భయంకరంగా అతి భయానకంగా గర్జించింది. (గర్జించాననుకుంది) బురదలోంచి ఒక్క దుముకుదుమికి అతణ్ని ఒకేఒక్క పంజాదెబ్బతో పరలోకానికి పంపాలనుకుంది. అనుకున్నదే తడవుగా శరీరంలోని సమస్తబలాల్నీ కూడదీసుకుని ఎగిరింది.

ఆశ్చర్యం! పులిరాజా ఎగరలేకపోయింది. ఇన్నాళ్లూ తన పథకంలో తనకు అమోఘంగా ఉపయోగపడ్డ బురదగుంటలో దిగబడి తనకాళ్లు పెకిలిరావడం లేదు. తన బలం పనిచేయడంలేదు. తన లాఘవం బురదగుంటనించి తనను లాగలేకపోతున్నది. ఎలాగ.... ఎలాగ....

పులిరాజు అటు గింజుకున్నది. ఇటు గింజుకున్నది. పిచ్చి పిచ్చిగా భయం భయంగా అరిచింది. ఇన్నిరోజులూ తనకు ఆహారం సంపాదించిపెట్టిన వజ్రపుటుంగరం ఎక్కడో బురదలోపడి కూరుకుపోయింది. రుద్రాక్షమాల ఎక్కడపడిపోయిందో జాడలేదు.

అతడు పులిరాజునా అవస్థలో చూచి నవ్వేడు నిర్దయగా కర్కశంగానవ్వేడు నవ్వి అన్నాడు.

'లాభంలేదు నన్ను చంపడం కాదుకదా నిన్నునువ్వే రక్షించుకోలేవు. మాయ చేసి మోసంచేసి మాత్రమే నువ్వు దొంగదెబ్బ తీయగలవు అంతకన్నా నీకు చాత కాదు. నీ గర్జనలకు ఇప్పుడు కుందేళ్లుకూడ భయపడవు– నువ్విన్నిరోజులూ జనానికి చూపించి వాళ్ళని ఆశపెట్టి మోసం చేసిన వజ్రపుటుంగరం ఎక్కడ? నీ రుద్రాక్ష మాల, నీ కల్లబొల్లి కబుర్లు, నీ కపటనాటకాలు ఏమయ్యాయి? అలా గింజుకుంటా వెందుకు-- లాభంలేదు. ఇన్నిరోజులూ నీకెంతగానో తోడ్పడ్డ యీ బురుగులోంచి నువ్వు బయటపడలేవు. పడలేవుగాక పడలేవు. ఇంతకాలం నీ రక్తదాహం తీర్చు కునేందుకు నువ్వు ఉపయోగించుకున్న ఈ బురదగుంటలోనే, నువ్వెంతమంది జీవితా లకో సమాధులుకట్టిన ఈ బురదగుంటలోనే, నువ్వు స్వయంగా తెలివిగా ఉపాయంగా ఏర్పాటుచేసుకున్న నీ యీ బురదగుంటలోనే నీ సమాధి కడతాను. యుగధర్మం నీ చావు కోరుతున్నది. మొత్తం ప్రపంచానికి ప్రపంచం నీచావుకోరుతున్నది. ఇప్పుడు నిన్నెవ్వరూ రక్షించలేరు. నీకు కాలం మూడింది'

అతడు చావుభయంతో కొట్టుకుంటున్న పులిరాజువైపు తుపాకి గురిపెట్టాడు.

---

(ఈ కథలోని ఈ క్రింది పదాలకు అర్థం తెలీనివారికి :

బురదగుంట లేక బురుగు = పార్లమెంటరీ ప్రజాస్వామ్యం + పెట్టుబడిదారీ విధానం; వజ్రపుటుంగరం = సోషలిజం అను ఒక పొడిమాట లేక నినాదం.)

## జ్ఞానమంటే ఏమిటి?

మానవ సమాజం విభిన్న వర్గాలుగా విభజింపబడినప్పటి నుంచీ— రెండు విధాలైన జ్ఞానం మనకు కనిపిస్తుంది. మొదటిది, వస్తూత్పత్తి కొరకు జరిగే పోరాటానికి సంబంధించినది. రెండవది, వర్గపోరాటానికి సంబంధించినది. ప్రకృతి శాస్త్రంలోను, సామాజిక శాస్త్రంలోను ఈ రెండు విధాలైన జ్ఞానం వుంది. ప్రకృతికి, సమాజానికి సంబంధించిన జ్ఞానాన్ని తత్వశాస్త్రం సంక్షిప్తపరచి సూత్రీకరిస్తుంది. ఈ రెండూ కాక మరోవిధమైన జ్ఞానం లేదు. సమాజం యొక్క ప్రత్యక్ష కార్యకలాపాలతో ఎట్టి సంబంధంలేని పాఠశాలల్లో చదువుకొనే విద్యార్థులవంక ఒకసారి చూదాం. వారి విషయమేమిటి? అలాంటి ప్రాథమిక పాఠశాల నుంచి వచ్చిన విద్యార్థి అలాంటి కాలేజీలోనే ప్రవేశించి కొన్నాళ్ళ తర్వాత డిగ్రీ తీసుకుంటాడు. అతడొక జ్ఞానసంపన్నుడుగా పరిగణింపబడుతాడు. కాని, అతను సంపాదించిన జ్ఞానమంతా పుస్తకాల్లో చదువుకున్నదే. ఏ ప్రత్యక్ష కార్యకలాపాల్లోనూ అతడు పాల్గొనలేదు. తాను సంపాదించిన జానాన్ని ఏ జీవితరంగానికీ అన్వయించలేదు. అలాంటి వ్యక్తిని మనం సంపూర్ణజ్ఞానిగా పరిగణించగలమా? ఎన్నటికీ పరిగణించజాలం. కారణమేమంటే? అతని జ్ఞానం యింకా సంపూర్ణం కాలేదు.

సంపూర్ణజ్ఞానమంటే ఏమిటో మొదట తెలుసుకోవాలి. సాపేక్షమైన [కంపారేటివ్] సంపూర్ణజ్ఞానం రెండు దశల్లో మనకు లభిస్తుంది. మొదటిది, గ్రాహ్యజ్ఞానం (Perceptual knowledge) రెండవది, హేతుబద్ధజ్ఞానం (Rational knowledge) గ్రాహ్యజ్ఞానం ఉన్నత దశకు పరిణతిచెందితే హేతుబద్ధ జ్ఞానమవుతుంది. విద్యార్థులు గ్రంథాలద్వారా తెలుసుకొన్న సమాచారం ఏవిధమైన జ్ఞానమవుతుంది? ఆ సమాచారం నిజమైన జ్ఞానమే అయినప్పటికీ సొంత అనుభవంద్వారా తెలుసుకొన్నది కాదు. వారి పూర్వీకులు ఉత్పత్తిక్రమానికిసంబంధించిన పోరాటానుభవాలను, వర్గపోరాటానుభవాలను క్రోడీకరిస్తూ రాసిన కొన్ని సిద్ధాంతాల సముదాయమిది. ఈ విధమైన జ్ఞానం చాలా అవసరమే. కాని, అది యింకా పాక్షిక జ్ఞానం. యితరులచే అది నిరూపించబడింది. అత్యంత ప్రధానమైన విషయమేమంటే— అట్టి జ్ఞానాన్ని చక్కగా నిత్యజీవితంలో, కార్యాచరణలో అన్వయించడమెలాగో తెలుసుకోవాలి. అందుచేత పుస్తకాలద్వారానే జ్ఞానం అందించి— ప్రత్యక్షానుభవం లేనివారికి నేనిచ్చే సలహా ఏమిటంటే? వారు తమ బలహీనతను గుర్తిస్తూ వినయంతో మెలగడం నేర్చుకోవాలి.

కేవలం పుస్తకజ్ఞానమేగల జ్ఞానుల్ని నిజమైన జ్ఞానులుగా తయారు చేయడమెలాగు ? ప్రత్యక్ష కార్యాచరణలో వారు పాల్గొనేటట్లు చేయడం తప్ప వేరు మార్గం లేదు. అలా చేస్తే వారు కార్యశీలురవుతారు.

అంటే ? సంపూర్ణజ్ఞానం సంపాదించుటకు రెండు విధాలన్నమాట— మొదటిది, పుస్తకాల్లో అదివరకే క్రోడీకరింపబడ్డ జ్ఞానం. రెండవది, గ్రాహ్యజ్ఞానం. ఈ రెంటినీ సమన్వయపరచడం ద్వారానే సర్వోత్కృష్టమైన సాపేక్ష సంపూర్ణజ్ఞానం కలుగుతుంది.

★ వర్గ చైతన్యాన్ని, ఐక్యతను, సంఘటిత శక్తిని అధికాధికంగా పెంపొందించుకుంటున్న కోట్లాది కార్మికులను ఛేదించగల శక్తి యీ భూతలంలో ఏదీ లేదు. కార్మికులు పొందిన ప్రతి ఓటమీ కొత్తకొత్త సమరయోధులను, కార్మిక సైన్యానికి చేరుస్తుంటుంది. విశాల ప్రజానీకంలో నూతన జీవిత చైతన్యాన్ని రగిలించి వారందరినీ సరికొత్త పోరాటాలకు ఆయత్తం చేస్తుంది.

★ ఈనాడు జరుగుతున్న ఘటనల ఫలితంగా కార్మిక ప్రజాసామాన్యంలో యీ జాగృతి వేగంగా విస్తృతంగా పెంపొంది తీరుతుంది. ఇట్టి పరిస్థితులలో కార్మిక ప్రజానీకాన్ని ఐక్యం చేసేందుకు, యిప్పటికన్నా నిర్ణయాత్మక పోరాటాలకు వారిని సమాయత్తం చేసేందుకు మన శక్తికొలది కృషిచెయ్యవలసి వున్నది.

— లెనిన్

(గతసంచిక తరువాయి)



# ఉప్పెన

ఇంతవరకు జరిగినకథ

సియావో నాయకత్వాన పది హేనుమంది పార్టీ కార్యకర్తలు 'యువాన్‌మావో' గ్రామానికి వస్తారు. పేదజనం మంచిరోజులు వచ్చేయని సంతోషిస్తారు. భూస్వాములు మాత్రం వాళ్ళని ఎలా మట్టుపెట్టాలా అని ఆలోచిస్తారు.

మొదట వూరి ప్రజలందర్నీ పిలిచి సభ ఏర్పాటు చేస్తారు కార్యకర్తలు. కాని ఆ సభ నిష్ఫలం కావడంతో, పేదల ఇళ్ళకే వెళ్ళి వాళ్ళతో పరిచయాలు పెంచుకోవడం మంచిదని తెలుసుకొంటారు.

సెక్షన్‌లీడర్ వాంగ్, చావోతో పరిచయం చేసుకొంటాడు. నాయకుడు సియావో లియూ తె-షాన్‌తో. ఇలాగే అందరూ.

ఆవూరి కామందు హాన్, సియావోని విందుకి ఆహ్వానిస్తాడు. సియావో తిప్పికొడతాడు.

కొన్ని ముఖ్యపాత్రల పరిచయం

ఓల్డ్‌సన్ — బండివాడు. ఏభైపైన వుంటుంది వయసు. గొప్ప సరదా మనిషి.

లియూ తె-షాన్ — కొంత కలిగిన రైతు. హాన్‌మీద ఇతనికీ లోపల్లోపల ద్వేషం వుంది.

లీ చెన్-చియాంగ్ — హాన్ దగ్గిర కౌలుదారు. హాన్‌కి ఏజెంటు, నమ్మినబంటు.

తీన్ — ఇతని పూర్తి పేరు తీన్ వాన్-షున్. "తీన్‌తాత" అంటారు, ఇతనూ హాన్ దగ్గిర కౌలుదారే. కాని మహాపిరికివాడు; పరమ అమాయకుడు.

చావో — పూర్తి పేరు చావో యు-లిన్. నిరుపేదరైతు, నిజాయితీపరుడు.

లియూ షెంగ్ — భూసంస్కరణ కార్యకర్తల దళంలో సభ్యుడు. కొంచెం తొందరపాటు మనిషి.

# 6

ఈ మధ్య సియావోకి క్షణంకూడా తీరిక దొరకడంలేదు. పగలూ రాత్రిఒకటే పని. తెచ్చుకొన్న కొవ్వొత్తులు కాస్తా మూడు రోజులకే అయిపోయేయి. అయినా నూనెదీపం ఒకటి వెలిగించుకొని. ఆ మసక వెలుతురులోనే తీవ్రంగా పనిచేస్తున్నాడతను. ఊళ్ళోవాళ్ల గురించి సభ్యులు సేకరించిన వివరాలన్నింటినీ కలబోసి పరిశీలిస్తున్నాడు ... ప్రజా విముక్తి పోరాటం నడపాలంటే ఏదోగుడ్డెద్దు చేలోపడినట్టు కాకుండా. వూరి పరిస్థితుల్ని. ప్రజల మనసుల్ని బాగా ఆకలింపు చేసుకోవాలి....

ఈ కొద్ది రోజుల్లోనే కార్యకర్తలు హాన్ గురించిన భోగట్టాలు బోలెడు సేకరించేరు. ఆ వూరి పేదజనం చాలామందితో మంచిస్నేహంకూడా చేసేరు. బండివాళ్లతో కూడా కత్తుకలిపేరు. వాళ్ళంతా ఎప్పుడో ఒకరోజు సాయంత్రం సరదాగా కబుర్లు చెప్పుకొండికి స్కూలుకి వస్తామని చెప్పేరు.

ఆరోజు సాయంత్రం ఇద్దరేసీ ముగ్గురేసీ జట్లుజట్లుగా రాసాగేరు. అందరికన్న ముందు వచ్చినవాళ్ళలో లియూ తె-షాన్ వున్నాడు. ఓ కిటికీని అనుకొని నిల్చొని చుట్టూ చేరినవాళ్ళతో కమ్యూనిస్టు సైన్యంతో* తన అనుభవాలు చెప్తున్నాడతను.

ఇంతలో ఓల్డ్‌సన్ వచ్చేడక్కడికి. జనమంతా అతనిచుట్టూ చేరేరు. అప్పటికి బాగా చీకటి పడిపోయింది. ఆ గదిలోవున్న నూనెదీపం రెపరెపలాడుతూ చీకట్లని తరిమివెయ్యడానికి తంటాలు పడుతోంది. చుట్టూ చేరినవాళ్ళ కాలక్షేపానికి ఓ ఎలుగుబంటికథ చెప్పసాగేడు ఓల్డ్‌సన్ :

"అదెలాగుందో తెల్సా ? నల్లగా దెయ్యంలాగుంది. బలంగా రాక్షసుడిలాగుంది. ఇంతలావు సెట్టుని ఒట్టుకోని, సిన్న కలుపుమొక్కని పీకేసినట్టు పీకీసింది. దెబ్బకి అంత మహావృక్షంవూ— పునాదుల్తో సహా ఇల్లు లెగిసిపోయినట్టు— వేళ్లతో సహా లెగిసిపోయింది. ఓ పెద్దపులికి దాన్తో కుస్తీ పట్టాలని మోజుపుట్టింది. యెలుగుబంటి అందుకు 'సైఁ' అన్నాది. సరే. కుస్తీకి రెండూ దిగిపోనాయి. ఇంకా యిలాగ రెండూ ఒక పట్టుపట్టుకున్నాయో లేదో. అప్పుడే అల్సిపోనాయి. 'ఓడిపోతానేంవో' అని బయ్యం వేసింది పెద్దపులికి. 'ఉండు. కసింతసేపు అగుదాం' అంది యెలుగుబంటితో...."

"అది సరేగాని. అటి కుస్తీపట్లు నువ్వు సొయంగా సూసేవా. లేకపోతే ఎవరన్నా సెప్తే యిన్నావా ?" అన్నాడొకడు మధ్యలో.

---

* Third Batallion తో

ఓల్డ్‌సన్ అతని మాట వినిపించుకోలేదు. ఓసారి కమ్మకొట్టి మళ్లీ కథలో పడ్డాడు :—

"....కసింత సేపు ఆగుదాంవందికదా. పెద్దపులి? 'సరే అలాగేకానీ' అన్నాది యెలుగుబంటి. పెద్దపులి ఎక్కడికి పోనాదో అలాగ ఎళ్ళిపోనాది. యెలుగుమాత్రం అక్కడే కూసుని, కుస్తీపట్టే జాగా అంతా సుబ్రింసేస్తూ వుండిపోనాది. ఈలోపుని పెద్దపులి మస్తుగా తిని, తాగి, కసింత సేపు నడుంవాల్చి, తాజాగా అప్పుడొచ్చింది. ఒచ్చి, 'రా, ఈసారిరా!' అన్నాది యెలుగుబంటితో. అప్పటికే మన యెలుగుబాగా అల్సిపోయి వున్నాది. దానికితోడు తెల్లారినుంచీ కడుపులో ఏం పడలేదేంవో ఆకలి ఆకలి! అయినా ఒప్పుకుంది. కుస్తీ మళ్లా ఆరంబంవయ్యింది. ఈసారి మళ్లా పెద్దపులే బేగి అల్సిపోనాది. 'కసింత సేపు కుస్తీ ఆపుదాంవా?' అన్నాది.... ఏటన్నాదీ? 'ఆపుదాంవా?' అన్నాది: అంతేగాని 'కసింత సేపు రెష్టు తీసుకుందాంవా?' అనలేదు. ఎందుకనలేదో తెలుసా? రెష్టంటే, యెలుగ్గూడా రెష్టే కావాలంటది. బుజబలంవైతే మస్తుగ వుందిగాని బుద్దిబలం బొత్తిగానేదు మన యెలుగుబంటికి. 'సరే, నియ్యిష్టం. అలాగేకానీ' అనీసింది అదిలాగ అనడంవేటి ఎళిపోయింది పెద్దపులి. ఎళ్ళి బాగా తిని, తాగి, అలసట తీ[illegible]చ్చకుని మళ్ళా వొచ్చింది. వొచ్చి, 'రా, కుస్తీకి రా!' అని పిల్చింది యెలుగుని. పోనీ ఈతడవైనా రెస్టు తీసుకోవాలా? సెప్పేనుగా దానికి బుద్ధి బలం సూన్యంవని! పులి ఎళ్ళినకాణ్నించి తిరిగొచ్చిందాకా సెట్లూ సేవంలూ పీకుతూ కూర్చున్నాది. ఇగనేంవుంది? ఈసారి కుస్తీలో షులిసేతితో సిత్తుగా ఓడిపోనాది!" అంటూ కథ పూర్తి చేసేడు ఓల్డ్‌సన్.

ఈలోపుని వూళ్ళోవాళ్ళు చాలా మందే వచ్చి చేరేరు. 'చావో' కూడావచ్చి ఓ దెస్కుమీద చుట్టకాల్చుకుంటూ చతికిలపడ్డాడు.

"అయిందా బాబూ, నీకథ?" అన్నాడు సియావో, ఓల్డ్‌సన్‌తో.

"ఓ, నాకథ ఎప్పుడో అయిపోనాది. ఇకను మీపని కానివ్వండి సామీ!" అన్నాడతను.

"సరే, మనంవంతా కొంచెం దగ్గిర దగ్గిరగా కూర్చొని మాటాడుకుందామా?" అన్నాడు సియావో. జనం సర్దుకు కూచున్నారు.

స్నేహితులారా! మనంవంతా ఈరోజు ఇక్కడ కష్టం సుఖం చెప్పుకొండికి చేరేము తప్ప, ఇదేదో పెద్ద కచేరీ అని అనుకోకండి. పద్నాలుగేళ్ళపాటు మనల్ని నరకయాతనలు పెట్టేరు మంచుకో ప్రభువులు. అంతకుముందు వేలాది సంవత్సరాల

పాటు మనలాంటి బీదా బిక్కీ జనాల్ని పీల్చి పిప్పిచేసేటు భూస్వాములు. జరిగిన అన్యాయాలకి మన నెత్తురు వుడుకెత్తుతోంది. మన కడుపులు కాల్తున్నాయి.... సోదరులారా, ఇక్కడ ఒకరు ఎక్కువా ఒకరు తక్కువా అన్న తేడాలేదు. మనంవంతా ఒకతల్లి పిల్లలం. అందరం పేదవాళ్ళం. రండి మనసువిప్పి మాటాడండి." అని అందరివైపు ఒకసారి చూసేడు సియావో.

"అవును. ఆబాబు సెప్పింది నిజంవే! మనకిమాత్రం తెలీదా? కమ్యూనిస్టులంటే ఎంతమంచోళ్ళో" అన్నాడు లియూ తె-షాన్. అని ఒక క్షణం ఆగి, ఇలా అన్నాడు: "సియావోబాబు శానామంచోడు. ఆ బాబుమీద మనబారం ఎట్టుకుని మనం నిస్చింతగా వుండొచ్చు. తోడబుట్టినోడితో సెప్పుకున్నట్టు మనం మన కస్టం సుకం ఆబాబుతో సెప్పుకోవచ్చు."

"సరే, అలాగే సెప్దాం. ఒకలతరవాత ఒకలు, ఎవరికితోసింది ఆల్లుసెప్దాం"– ఈ మాటలు కిటికీదగ్గిర నించున్న లీచిన్-చియాంగ్‌వి. మాటాడుతూనే టోపీ వెనక్కి తోసుకున్నాడు. నున్నటి అతని బట్టతల చిమ్నీవెలుగులో మెరిసిపోతోంది.

"సెప్పు, ఎవరు ముందు సెప్పేరు, ఎవరు ఎనక సెప్పేరన్న బాదలేదు. నీకు తోసిందేదో నువ్వు సెప్పు" అన్నాడు లియూ.

"నిజంవేనర్రా! సెప్పండి! ఎవరు ముందు సెప్తారు? కమ్యూనిస్టు సిపాయీలంటే చాలా మంచోళ్ళు. పేదా గొప్పా అన్న తేడాలు ఆళ్ళకిలేవు. మనంసెప్పిన దాన్లో తప్పులేంవన్నా వుంటే మన్ని కొట్టరు, తిట్టరు. అందుసేత ఎవరో ఒకరు ముందు మొదలెట్టండి." అన్నాడు లీ.

ఎంతకీ ఈ ఇద్దరే మాటాడుతున్నారు తప్ప, మరొకడెవడూ నోరుమెదపలేదు. చావో చుట్ట కాల్చుకొంటూ అలా డెస్కుమీదే కూచున్నాడు. ఓల్డ్‌సన్ ఏమూల వున్నాడో ఎక్కడా కనిపించడం లేదు. లీపక్కనే కూచున్నాడు తీన్‌వాన్-షున్. అతనెందుకో బాగా భయపడుతున్నాడు. 'లీ' హాన్‌కి గూఢచారి. ఆ సంగతి తీన్‌కి తెలుసు. అందుకే ఏమాట అంటే ఏం కొంప మునుగుతుందోనని అలా బెంగగా బిగదీసుక్కూర్చున్నాడతను. అతన్ని చూసేడు సియావో. సంగతి అర్థమయినట్టుంది.

"నిన్నెవ్వరూ ఏమీ చెయ్యరు. భయపడకు. నువ్వు ఏంచెప్పదల్చుకుంటే అదే చెప్పు. మరేం భయంలేదు" అన్నాడు తీన్‌తో.

లీ మళ్ళీ తయారయేడు. "సియావోబాబు సెప్పింది కరెక్ట్. ఇయాళ ఎవడూ ఎవడికీ బయపడక్కర్లేదు. ఎవరికి తోసింది ఆళ్ళు సెప్పుకోవచ్చు. పూర్వం మంచుకో గవర్మెంటు రోజుల్లో సంగతి వేరు. ఇప్పుడు ఎవడికిరాజు ఆడే మహ" అన్నాడు.

అయినా ఎవ్వరూ నోరు మెదపలేదు. అంతటా నిశ్శబ్దం ఆవరించుకొంది. సియావో ఊరికే తెగవదార్లు చేస్తున్నాడు. వీళ్ళచేత మాటాడించడం యెలాగా అని ఆలోచిస్తున్నాడతను.... ఒకలాగచేస్తే బావుంటుందేమో ? అందరికీ తెలిసిన సంగతి చెప్పి, దానిమీద మాటాడమని అడిగితే ?.... సియావో కనుబొమలు ముడుచుకున్నాయి. టోపీ తీసి ఓచేత్తో పట్టుకొని, మరోచేత్తో తలమీద రాసుకున్నాడు. నున్నటి తల తళ తళ మెరిసింది. అతని బుర్రలో ఓ మెరుపు మెరిసింది. టక్కున తలఎత్తి జనాన్ని అడిగేడు:

"మీలో ఎవరినైనా బలవంతంగా లేబరుకేంపుకి పంపించేరా ?"

"అందరం ఎళ్ళేం బాబూ, అందరం ఎళ్ళేం !" అన్నారందరూ, ఒక్క 'లీ' తప్ప. ఒక్కసారి అందరూ ఆనాటి పేగులు కనలే ఆకలినీ, ఎముకలుకొరికే చలినీ, ఒళ్లు హూనమయ్యే దెబ్బలనీ తల్చుకున్నారు. దాంతో అంతదాకా ఆగదిని ఏలుతున్న నిశ్శబ్దం పుంజాలు తెంపుకు పారిపోయింది. అందరూ ఒక్కసారే మాటాడ్డం మొదలు పెట్టేరు. పాతిక ముప్ఫైమంది జట్లుజట్లుగా విడిపోయి చెప్పుకోసాగేరు. ప్రతివాడూ తనమాట అవతలవాడు వినాలనే తాపత్రయపడుతున్నాడు. ఇందరు యిన్ని రకాలుగా గత స్మృతుల్ని తవ్వు కొంటున్నా, లీచెన్-చియాంగ్ మాత్రిం నోరు మెదపలేదు. బెల్లంకొట్టిన రాయిలాగ అలాగే వింటున్నాడు.

"లేబరు కేంపుకి నన్ను బలాత్కారంగ తోసేరుబాబూ. ఒకనెలగాదు; రెండు నెలలుగాదు— ఆరు నెల్లపాటు ఇంటికాడలేను. తిరిగొచ్చేసరికేటుంది ? బంగారం నాంటి పంట మట్టికొట్టుకుపోనాది" అన్నాడు 'చావో' చుట్ట అవతల పారేస్తూ.

"నువ్వేటి పంట పోనాదంటున్నావు. నాకైతే ఇంటికి దీపం నాంటి యిల్లాలే పోనాది" అన్నాడు హువా.* "ఆరేల్ల కిందటిమాట. అప్పుడు మా ఇంటిదానికి బాగా సుస్తీ సేసింది. అలాటి టయింలో లేబర్ కేంపుకి నన్ను తోలీసినారు 'మియా' అని సెప్పే జపాన్ ఆఫీసరు వున్నాడు. అడిదగ్గిరికిపోయి కాల్లా వేల్లాపడి బతిమాలినాను— బాబూ, నాబార్యకి ఒంట్లో నయమయీదాక నన్ను ఒగ్గీయండి. ఆ తరవాత నానే వొచ్చి సేరుతాను— అన్నాను. ఆ బాబు నామాట యినలేదు. కన్నింతా ముక్కింతా సేసుకొని, 'అయితే ఏటాౖ. నువ్వెల్లవూ ? నువ్వెల్లకపోతే నీ బాబెవడు ఎల్తాడనుకున్నావురా ? నేనెల్లాలేట్రా నీబదులు ? నీ పెల్లాం ఓ రోగిస్టిముండ ! నువ్వు ఓ తెలివితక్కువఎదవ్వి ! కాని నాను తెలివితక్కువ్వోణ్ణికానురారే ! నీకు సాయం సెయ్యమంటున్నావు బాగానే

* ఇతని పూర్తి పేరు : హువా యుంగ్-పీ, 'చావో' పొరుగింట్లో ఒంటరిగా వుంటున్నాడు.

వుంది. కాని నాకెవడు సేస్తాడురా సాయం!! సాయం సెయ్యాలిట సాయం!! పో లంజికొడకా! పో!! అన్నాడు. నాకు అంతా అర్థమయిపోనాది. ఇకను బ్రహ్మదేవుడే డిగొచ్చినా నారాత తప్పించలేడు. లేబరుకేంపుకి ఎల్లిపోయేను. అరునెల్లపాటు శవం లాగ బతికేను. తిరిగొచ్చీసరికేటుంది? నా ఇంటి దీపం ఆరిపోనాది. పిడికెడు బుగ్గే మిగిలింది.... నాను మల్లీ పెల్లి సేసుకోలేదు" అంటూ ఒక నిట్టూర్పు విడిచేడు హువా.

అంతలో ఎక్కణ్ణించి వచ్చేడో, ఒక్కసారి వూడిపడ్డాడు ఓల్సన్. "బాబోరే! నువ్వు నీ భార్య సచ్చిపోనాదంటున్నావు. నానైతే సావుకి బెత్తెడు దూరం ఎల్లి మల్లీ బతికేను. ....మమ్మల్ని బొగ్గుగనుల్లో పనికితోలీసేరు. గంటలతరబడి పని. రెండంటే రెండే సంకటి ముద్దలు మా తిండి. కూటికి మొగంవాసి పోయిఁది పేగులు అంటుకు పోయేవి. ఏరోజు కారోజు సచ్చిపోతానేఁవో అనుకునీవోణ్ణి" అన్నాడతను.

"నాను పడ్డ బాదలకాడ ఇయన్నీ ఏపాటి?" అన్నాడు తీన్‌వాన్-షున్ నెమ్మదిగా ధైర్యంచేసి. "ఓ కొండవాలులో మేం పనిసేసీవోళ్ళం. ఎర్రి ఆకలి ఏసీది. ఆ బాదకి తట్టుకోలేక. మాలో కొందరం కొండమీదికి ఎక్కి ఆకూ అలఁవూ తినీసీవోళ్లం. ఆ ఎదవలకి అదీ కడుపుకుట్టుగానే వుండీది. అళ్లపనికి అటంకంవచ్చుద్దని మమ్మల్ని కొండ మీదికి ఎళ్ళనిచ్చీవోరుకాదు. ప్రతిరోజూ సాయంకాలం మమ్మల్నందర్నీ వొరసలో నిల్చోపెట్టి మా నోళ్లు తణికీ సేసీవోరు. ఆకుపచ్చగా ఎదైన పసరు అంటుకునివుండేఁ వోసని! నోట్లో వచ్చగా ఏదైన కనబడ్డాదో, అదిపని ఆరోజుతోసరి! గొడ్డునిబాదినట్టు బాదేవోరు. అటు ఆకలి, ఇటు దెబ్బలు. రోజుకి కనీసం డజను మందైనా సచ్చి పోయీవోరు"

"ఏవూరు డజన్లూ రొండు డజన్లూ సెప్తావు! దీపం పురుగులు సూడు వందలూ వేలూ సస్తాయి; అలాగ మనుసులు సచ్చిపోడం నువ్వు సూసుందవు" అన్నాడులియూ. తీన్ లాంటి పిరికివాడే నిర్భయంగా మాటాడేసఁకి అతనికికూడా తన కథ చెప్పాలని పించింది.

"నానుకూడా బొగ్గుగనుల్లోనే పనిసేసేను బాబూ! ప్రెతిరోజూ ఆకూ అలం తప్ప తినడానికి మరోటి దొరికీదికాదు. అప్పుడోసారి సలికాలం వచ్చింది అలాటి లాటి సలిగాదు; ప్రేణాలు తోడేసే సలి!! బూఁపికి మూడడుగుల ఎత్తుదాకా పేరుకు పోయింది మంచు. పనిసెయ్యడానికి మాకెవుడికీ ఒంట్లో సత్తువలేదు సలి! ఆకలి!! అలాగుండగా ఓరోజు రాత్తిరి నాను నిద్దరోతున్నాను. ఎవలో తట్టి లేపేరు. తుల్లిపడి లేసేను. 'లే, బేగిలెగు! పనుంది' అన్నాడెవలో. కళ్ళు నులుపుకొని అడిగేను: 'అప్పుడే తెల్లారిపోనాదా?' అని. సెళ్లమని ఏసినాడు ఒకిదెబ్బ. 'ఎంటనే లేసి నాతో

వస్తావా, మరోటికావాలా?' అని అడిగినాడా బాబు. నాకు నిద్దరమత్తు వొదిలిపోనాది. గనికాడికి పరుగులు తీసేను. నా వెళ్ళేసరికి అక్కడ ఓ బండి సిద్దంగా వున్నాది. బండి నిండుగా వున్నాదో లేదోనని వెయ్యేసి సూసేను. నరాలు జివ్వుమన్నాయి! ఎంటనే 'కఁయ్యి' మని కేకేసేను. టపీమని పడ్డాది మరోదెబ్బ! 'నీకియ్యాళ సావురా సుందిరా, నంజికొడకా! నోరుమూసుకుని ముందు బండిలాగుతావా, తన్నమన్నావా?' అన్నాడు. అంత సలిలోనూ నాకు ముచ్చెఁవటలు పోసీసినాయి. నోరు మెదపకండా బండిలాగుతూ పోయేను.... బండిలో ఏటుందో తెలుసా? సెవాలు! మనుసుల సెవాలు! సలికి కొయ్యబారిపోయిన పీనుగులు!! బండినిండా బండెడు వున్నాయి. అలాగ ఒక బండికాదు, రెండు బళ్లు కాదు; లెక్కలేనన్ని బళ్లు— గనికాణ్ణించి ఏటికాడికి నానే సొయంగా లాక్కెళ్లేను. ఆ ఏరంతా మంచుతో గడ్డకట్టుకు పోయివున్నాది. అందులోనే ఓ పెద్ద కన్నంచేసి, ఆ కన్నంలోంచి ఈ సెవాలన్నింటినీ నాసేతే తోయించేరు. రోజుకి డజనుమంది సచ్చిపోడఁవే ఏదో పెద్ద కబురులాగ సెప్పేవు నువ్వు. కాని బళ్ళకి బళ్లు సెవాల్ని రోజూ సూసేన్నేను. మనిసి పేణానికి అక్కడ ఇలవలేదు. గడ్డిపోసకున్న పాటి యిలవకూడాలేదు. మనిసి సచ్చేడు; మంచుబొక్కలోపడి పాతాళానికి పోయేడు- అంతే! అంతే! ..." అంటూ ఒకనిట్టూర్పు వదిలేడు లియూ.

ఆ దీనుల కన్నీటిగాథలకి అంతులేదు. ప్రతిఒక్కరికీ చెప్పడానికి అవకాశమిచ్చేడు సియావో. అప్పటికే బాగా పొద్దుపోవడంతో మరోవిషయం ఎత్తుకొన్నాడతను. "అసలు అలాంటి నరకంనించి మీరంతా బతికి బయటపడ్డారంటేనే ఎంతో ఆశ్చర్యంగా వుంది" అన్నాడు.

"అవును బాబూ, నిజఁవే" అన్నారంతా ముక్తకంఠంతో.

"ఆ టయాంలో* సోవియట్ సిపాయీల మరతుపాకులుగాని పేలకపోయివుంటే మేఁవంతా ఆరోజే ఆ మంచుబొక్కలోబడి సొర్గానికో నరకానికో పోయుందుఁవు." అన్నాడు చావో.

"నువ్వు చెప్పింది నిజమే. అవునూ, లేబర్ కేంపుకి మిమ్మల్నందర్నీ పట్టుకు పోయేరుగాని, బుగతల్నెవరైనా తీసుకెళ్లేరా? బాగా జ్ఞాపకం తెచ్చుకొని చెప్పండి" అన్నాడు సియావో.

"లేదు! బుగతల్నెవడూ పట్టుకెళ్ళలేదు" అన్నారంతా.

"ఎందుచేత?" అన్నాడు సియావో.

---

* 1940వ సంవత్సరం ఆగస్టు 15వ తేదీన

ఎవరికితోచిన కారణాలు వాళ్లు చెప్పేరు. జపాన్‌వాళ్లకి లంచంయిచ్చి బుగతలు తప్పించు కొన్నారని కొందరన్నారు. కొందరేమో, వాళ్ళబంధువులూ స్నేహితులూ ప్రభుత్వంలో వుండబట్టి తప్పించుకోగలిగేరన్నారు. మరి కొందరేమో, భూస్వాముల కొడుకులూ మేనల్లుళ్లూ పోలీసులుగానూ, సీ. ఐ. డీ. లు గానూ పనిచేస్తున్నారు గనక తప్పించుకోగలిగేరన్నారు. ఇంకా కొందరయితే, ఆ మోతుబరులంతా తమ బదులు తమ పాలేళ్ళనీ, బొమ్మల కాపర్లనీ పంపించేరన్నారు. ఇలా ఒక్కొక్కరు ఒక్కొక్క కారణం చెప్పేరు.

"లేబర్ కేంపుకి అసలు వెళ్ళకుండా వుండిపోయిన కుటుంబాలెన్ని వుంటాయి?" అన్నాడు సియావో.

"ఓ, శానా కుటుంబాలే వున్నాయి బాబూ!" ఈ మాటలు లీచెన్-చియాంగ్‌వి. ఇంతసేపూ అతను నోరు మెదపలేదు.

తక్కువని అసలు విషయానికి వచ్చేడు సియావో. "హాన్‌గారిని ఎప్పుడైనా పంపించేరా?" అన్నాడు కుండబద్దలు కొట్టినట్టు.

ఈ ప్రశ్నకి చావో చెప్పేడు సమాధానం: "ఒక్క ఈవూరినించే పదివేలమంది కూలోళ్లు కావాలని జపానోళ్లు వొచ్చినా, హానుబాబుమీద ఈగైనా వాలదు. ఆ బాబు నెవడూ పట్టుకెళ్ళలేడు" అన్నాడతను మళ్ళీ చుట్ట ముట్టించుకొంటూ.

చావో మాటాడుతూ వుండగా, దూరంగా చీకట్లో నిల్చొని వున్న మనుషులు ముగ్గురు చల్లగా బైటికి జారుకున్నారు. వెళ్ళిపోతున్న వాళ్ళని వెనక్కి పిలవడానికి లియూ షెంగ్ లేవబోయేడు. అతన్ని వారించేడు సియావో. "వాళ్ళని వెళ్ళనీ" అన్నాడతను. జనంకేసి తిరిగి మరోప్రశ్న వేసేడు: "తిండి, బట్ట, ఉండడానికి ఇల్లు—వీటిలో మీకూ హాన్‌కీ తేడా ఏమన్నా వుందా? మీరెలా బతుకుతున్నారు? అతనెలా బతుకుతున్నాడు? అన్నాడు.

"ఏనుక్కీ ఎలక్కీ పోలికేటి" అన్నాడు లియూ తె-షాన్.

"ఉన్నవారికే అన్ని సుకాలూ రయ్యో రయ్యా! లేనివాడిగతి యీ నోకంలో మయ్యో, గొయ్యో!!" అన్నాడు ఓల్డ్‌సన్ రాగయుక్తంగా.

"పూటకి టికాణాలేనోళ్ళంగదా మేం‌వు? మా బతుకుల్ని బుగతల్తో పోల్చుకోగలంవా?" అన్నాడు తీన్ వాన్-మున్. అతనికిప్పుడిప్పుడే కొంచెం ధైర్యంవస్తోంది. "అళ్ళకీ మనకీ పోలికేటి? అళ్లు పుట్టినయేళా యిసేషం మంచిది. కాలుమీద కాలు ఏసుగూకుచున్నా, అళ్ళ కాళ్ళకాడికే అన్నీ వొస్తాయి. పంచభక్ష పరమాన్నాలూ

తింటారు. మస్తుగా తాగుతారు. పట్టుబట్టలు కట్టుకుంటారు. పెద్ద పెద్ద బవంతుల్లో ఉంటారు. మరి మనం? తెల్లారే లెగుస్తాం. పొద్దోయేదాకా పాటుపడతాం. గొప్పులు తవ్వుతాం, గోడలు కడతాం, బరువులు మోస్తాం. మన తిండి? ఆకూ, అలంవా! మన ఇల్లు? మనం కట్టుకున్న కొంపలోకూడా మనం ఉండడానికి నోసుకోలేదు....!" తీన్ కళ్ళలోంచి బొటబొటా నీళ్లు రాలేయి. తను స్వయంగా కట్టుకున్న మూడుగదుల కొంపవి బలవంతంగా లాక్కొని గుర్రాలసాలగా మార్చుకొన్నాడు హాన్. అది తల్చుకోగానే అతనికి దుఃఖం పెల్లుబికింది. ఇంకా ఏదో చెప్పేవాడే. కాని పక్కనున్న 'లీ' చూపులు అతని నోరు మూయించేసేయి.

"ఏం బాబాయ్, ఆపేసేవు? ఏంవయింది?" అన్నాడు సియావో.

తీన్ దగ్గిరికి వెళ్ళి అతని భుజంతట్టి "తీన్ తాతా! మరేం భయపడకు. నీ కడుపులో వున్నదంతా యివాళ చెప్పెయ్!" అన్నాడు చిన్నవాంగ్ ఆదరంగా.

"చెప్పెయ్ బాబాయ్! నీ బాధలన్నీ చెప్పెయ్!" అన్నాడు సియావో మళ్ళ.

తీన్ ఒక్కసారి తలెత్తి పక్కనున్న లీ వైపు చూసేడు. వెంటనే మెల్లగా, "అదంతా నా కర్మం బాబూ! నుదుట్ని ఒకలాగ రాసుంటే, జరిగీది మరోలా జరుగుతాయా? మరింక నాను పెప్పవల్పిది ఏదీలేదు. మిగతావాళ్ళని సెప్పమనండి" అన్నాడు.

ఈసారి లీచెన్-చియాంగ్ లేచేడు. లేస్తూనే ముందు సియావోకి ఓ నమస్కార బాణం వేసేడు. తరవాత జనానికి మరో బాణం వేసేడు.

"నేను ఎక్కువ మాటాడను. రెండుముక్కలు సెప్పి కూసుంటాను నేనేం పెద్దలీడర్ని కాను. అందుసేత నేనుసెప్పేదాంట్లో పొరపాటులేవన్నావుంటే అందుకు నన్ను సెమించమని పార్తిస్తున్నాను. నాపేరు లీచెన్-చియాంగ్. మన తీన్ తాతలాగే నేనూ హాన్ కాడ కౌలుసేసుకొని బతుకుతున్నాను. మేంవిద్దరం శాలాఏళ్లు హాన్ దగ్గిర పనిసేసినోళ్ళం గనక హాన్ ఎలాటోడో మాకు బాగా తెలుసు. ఆబాబుకి మాటకటువు గాని మనసు మెత్తన" అన్నాడు.

కస్సుమని లేచేరు లియూషెంగూ, చిన్నవాంగూ. గబగబా లీ దగ్గిరికి వెళ్లేరు.

"ఎవరు పంపిండు యిక్కడికి నిన్ను?" అడిగేడు లియూషెంగ్.

"వన్నెవురూ పంపలేదు బాబూ! నేనే వొచ్చినాను" అన్నాడు లీ తొట్రుపాటు కనబడనివ్వకుండా.

"ఎందుకొచ్చేవు నువ్విక్కడికి?" అన్నాడు వాంగ్ కోపంగా.

"ఏంలేదు. వృత్తినే ఒచ్చినాను." అన్నాడు లీ. ఈసారి అతను తడబాటు దాచు కోలేకపోయేడు.

"ముందు అతను చెప్పదల్చుకున్నదేదో అతన్ని చెప్పనివ్వండి!" అన్నాడు సియావో. ఈ యువకిశోరాలు రెండూ కలిసి 'లీ'తో ముష్టియుద్ధానికి దిగిపోతారేమో ననిపించిందతనికి. జనం చెయ్యవలసిన పనిని పార్టీ వ్యక్తులొక్కరే చెయ్యడం మంచిదికాదు. అలా చెయ్యడంవల్ల జనానికి మనం చెప్పేదేమీవుండదు. సరికదా వాళ్ళ దృష్టిని అసలు శత్రువునించి మళ్ళించినవాళ్ళ మవుతాం. అందుచేత సౌమ్యంగా 'లీ'ని అడిగేడు సియావో:

"అయితే నువ్వు హాన్‌గారి దగ్గిర కొలుకి చేస్తున్నావన్నమాట. మంచిది, మరి మీ బాబుగారికి ఎన్ని ఎకరాల పొలం వుందో చెప్పగలవా?"

"ఈ వూళ్ళో ఓ రెండొందల ఎకరాల్దాకా వుంటాదేఁవో బాబూ!" అన్నాడు లీ.

"మరి మిగతావూళ్ళలో ఏమాత్రిం వుంటుంది?"

"ఏఁవో. నాకు తెలీదు."

"గొడ్డూ గోదా ఏమాత్రిం వుంటాయి? గుఱ్ఱబ్బళ్ళెన్ని వుంటాయి?"

"సరీగ తెలీదుగాని బాబూ. గొడ్లు ఓ పదిపన్నెండు వుంటాయి."

"అరేయ్! ఏట్రా నీ కోతలు? హాన్‌గాడికి ఒక్క పసువులే పాతిక ముప్పై దాకా వున్నాయన్న సంగతి ఎరగనోడెవడు?" అన్నారెవరో గట్టిగా, వెనకనించి. ఆ మాటలు అన్నదెవరో చూద్దామని ఎనక్కి తిరిగేడు 'లీ'.

"వెనక్కి తిరిగి చూడక్కర్లేదులే!" అన్నాడు సియావో కొంటెగా నవ్వుతూ. "ఆ మాట అన్నదెవరోచూసి సోల్తీ పట్టడంవల్ల ప్రయోజనం లేదు. రోజులు మారి పోయేయి. బందిపోటు లియూ*గాడు ఏ కొండల్లోకోపోయి తలదాచుకున్నాడు. ఆ మాటకొస్తే స్వయానా చాంగ్‌కై-షేక్‌ని కూడా ఎవడూ రక్షించలేడు. అలాంటప్పుడు వాడేదో మీ హాన్‌గారిని రక్షిస్తాడనుకోవడం కలలోనిమాట!" అని ఆగేడు సియావో. చల్లగా మెల్లగా ఎలాగ పేల్చినా, బాంబు బాంబే! అసలు ఇంకా, "మీ హాన్‌గాడి బతుకు ఈ పేదప్రజల చేతుల్లో వుంది" అని అందామనుకున్నాడు. కాని జనానికి తమ శక్తి ఇంకా పూర్తిగా తెలియని స్థితిలో తను ఆ మాట అనడం తొందరపాటే అవుతుందనిపించిందతనికి. 'లీ'ని మరో ప్రశ్న అడిగేడు. "నువ్వు ఈ చాకిరీ

---

లియూ సౌ-ఫీ అతని పూర్తిపేరు.

అంతా చేస్తున్నావుకదా, మీ బగత నీకేమాత్రం ముట్టజెప్పుతాడు? దున్నుకుందికి పొలం వుత్తినే ఇస్తాడా?"

"ఎలాగిస్తాడు బాబూ!" అన్నాడు లీ అమాయకత్వం నటిస్తూ. కాని అది పచ్చి అబద్ధం. సియావోవాఘ్కూ వూళ్ళోకి వచ్చిన రోజు రాత్రి చాలాసేపు హాన్‌తో రహస్యంగా మంతనాలు జరిపేడు లీ. తనకి సాయంచేస్తే మూడేళ్ళపాటు శిస్తు కట్టక్కర్లేకుండా దున్నుకోనిస్తానని మాట ఇచ్చేడు హాన్. అదిగో ఆ మూడేళ్ళ ముష్టి సాయానికీ, తనకున్న కాస్త కొంగ్రనీ కాపాడుకోడం కోసం— ఈ 'లీ' గారు హాన్‌గారి కొమ్ముకాసి, రైతులకి వ్యతిరేకంగా నిలబడ్డాడు. సియావోకి అంతా అర్థమయింది. కాని ఇంకా మరో అవకాశం ఇద్దామనుకొన్నాడు. వీడి సంగతి తర్వాత చూడొచ్చు. ఇప్పుడు అసలు శత్రువు హాన్. ముందు, వాడిగురించి. జనం ఏమనుకొంటున్నారో తెలుసుకోవాలి.... గదిమధ్యలో నించుని, జనాన్ని అడిగేడు సియావో.

"మీలో ఎవరినైనా హాన్ బాధపెట్టేడా?"

"పెట్టేడు బాబూ, పెట్టేడు! నరకయాతనలు పెట్టేడు!" గదంతా మారు మోగింది.

"అయితే ఒక్కొక్కరూ చెప్పండి; మిమ్మల్నేం బాధలు పెట్టోడో?"

ఓ, బోలెడు భోగట్టాలు బైటపడ్డాయి. కౌలుకి పొలాన్నిచ్చి, విత్తనాలూగట్రా కొనుక్కోడానికి చక్రివడ్డీలకి అప్పులిచ్చి పేదవాళ్ల పచ్చినెత్తురు తాగేడు హాన్! అప్పు తీర్చలేకపోతే హాన్ ఏం కోరితే అది యిచ్చుకోవలసిందే; ఒక్కొసారి ఇంటిల్లపాదీ వెట్టిచాకిరీ చెయ్యవలసి వచ్చేది. వూరి జనం తవ్వుకొన్న నుయ్యి కాస్తా దౌర్జన్యంగా లాక్కొని హక్కుభుక్తం చేసుకొన్నాడు హాన్. ఆయనగారికి కోపం తెప్పించినవాడెవడూ బతికి బట్టకట్టలేదు. ఆ వూళ్ళో వున్న అందాలభరిణెలనెందరినో పాడుచేసేడు హాన్! ఇలాగ ఎన్నో ఎన్నెన్నో.

కన్నెపిల్లల్ని చెరచడం సంగతి చెప్పగానే తీన్‌తాతకి మళ్ళీ ఏడుపు ముంచుకొచ్చింది. దీపం వెలుగులో అతని కళ్లు మెరిసేయి.

అతన్ని చూచేడు సియావో. ప్రేమగా, "బాబాయ్, ఎందుకలా బాధపడుతున్నావు చెప్పవూ?" అన్నాడు.

'నేదు బాబూ ఏంనేదు. చెప్పడానికేఁదీ నేదు" అన్నాడు తీన్, పక్కనున్న లీని కీగంట చూస్తూ.

డెస్కు దిగి చుట్ట అవతల పారేసి రెండడుగులు ముందుకువేసేడు చావో. తొడు క్కున్న కోటు బొత్తాలు విప్పేసేడు. అది అతని అలవాటు. ఏదైనా మాటాడవలసి వస్తే చాలా వుద్రేకపడిపోతాడు. దాంతో అతనికి విపరీతంగా చెమటలు పోసేస్తాయి.

'నేస్తాల్లారా! నాను యీ వూల్లో పేదోల్లందరిలోకీ పేదోణ్ని. మీరంతా నా ఎనక 'మొండి మొలోడు, మొండి మొలలిన్' అని పిలుస్తురని నాకు తెలుసు. కాని అందుగురించి నానేం పెద్ద బాధపడలేదు. అమాటకొస్తే, నా మొగంమీదే ఆ మాట అన్నా నాను బాదపడను....' అన్నాడు చావో.

ఎవరో కిసుక్కున నవ్వేరు.

"ఇందులో నవ్వడానికేటుందెస్!" అన్నారు మరెవరో కోపంగా. "పేదోణ్ణి సూసి నవ్వడానికి సిగ్గెయ్యడం లేదా?"

"మరేటీ కొంపమునిగిపోదు. నవ్వీవోళ్ళని నవ్వనీ. పేదోడై వుండడం మహా పాపం వేంవీ కాదనీ పియావో బాబు సెప్పేడు. నిజంగా నా బార్యకి ఒకరోజు కాదు రెండురోజులుకాదు, అయిదేల్లపాటు కట్టుకుందికి గుడ్డా, తినిందికి సరైన తిండీ లేవు. గాని యెన్నడూ అది కానిపని సేసి యెరగదు."

"చావో సెప్పింది నిజం. ఆడి పెల్లాంలాంటి పిల్ల నిలువెత్తు బంగారంపోసినా దొరకదు" అన్నాడు ఓల్డ్‌సన్,

"కట్టుకుందికీ కప్పుకుందికీ గుడ్డముక్కన్నది నేకండానే మాం బతికేం"అన్నాడు చావో మళ్ళీ. "ఏసం కాలం కొంత పరవానేదుగాని, సలికాలంవే సంపీసీది. పొద్దు పోడంతోటే తల్లి నలుగురం కొంగుమీదికి సేరీవోళ్ళం. ఆ కొంగుమీదే మాకు సలి కాలం, వర్షాకాలం, ఏసంకాలం— అన్నికాలాలూ ఒక్కపాలే ఒచ్చేసినట్టనిపించీది. నిద్దరమాతిరిం ఒక్క కునుగ్గూడా తియ్యడానికి కుదిరీదిగాదు."

"అంతే బాబూ! పేదోళ్ళబతుకులన్నీ ఒక్కలాగే నల్లారుతున్నాయి!"అన్నాడు ఓల్‌సన్.

చావో మళ్ళి చెప్పసాగేడు: "గాని బాబూ! పేదోళ్ళకి ఏదైన కరువుగాని ధయి ర్యానికి కరువునేదు: పరువు మరియాదలకి కరువునేదు. అంత యిదిగా దినాలు ఎళ్ళ దీస్తున్నా, నేనుగాని మా యావిడగాని ఒక్కనాడు ఒకళ్ళసాయం కోరనేదు: ఓ దొంగ తనం సెయ్యనేదు: ఓ పొరపాటుపని సెయ్యనేదు. మా కండలు కరిగించి పనిసేసేం. ఈ నోకంలో అదేం విశిత్రంవోగాని, నువ్వెంత మంచోడివైతే నీకంత ఎక్కువకస్టాలూ బాదలూ ఎదురుదెబ్బలూ తగుల్తాయి! నాలుగేళ్ల కిందటిమాట. అప్పుడు మా ఇంట్లో

రోజులతరబడి పొయ్యిలో పిల్లి లెగిసేదిగాదు. నాను దొరికిన్నాడు కేవలపిల్లులూగట్రా తెచ్చేవోణ్ని. గాని అయిమాత్రిం రోజూ దొరుకుతాయా? ఓసారి మూడు దినాల పాటు తినిందికేటీనేక పస్తులు పడుకున్నాం. నాకొడుకూ, కూతురూ కొంగుమీద బల్లు ల్నాగ అతుక్కుపోయి పడుకున్నారు. 'అకలి, అకలి' అని అరిసి అరిసి ఇక అరడాని కూకాడా వొంట్లో సత్తువనేక సొమ్మసిలి పోనారు. ఆళ్ళని సూస్తూ మా యావిడ గుడ్ల నీళ్లు కుమ్మకుంటూ కూర్చుంది...."

చావో చెప్పింది వింటూ తలవొంచుకొన్నాడు తీన్‌తాత. కన్నీరు ధారాపాతంగా అతని చెక్కిళ్లమీంచి జారింది. చొక్కా చేత్తో కళ్లు ఒత్తుకొన్నాడు వాంగ్. కిటికీదాకా వెళ్ళి బైట ఆకాశంలోకి చూసేడు లియూషెంగ్. అతనికి గుండె బరువెక్కినట్టని పించింది. నిండుకుండలాంటి సియావోకే గొంతు వణికింది. గద్గదకంఠంతో,

"ఊ, చెప్పు. తరవాత ఏంజరిగింది?" అన్నాడు.

"మరేటున్నాది? ఎంటనే పిల్లలిద్దరికీ తినిందికేదేన ఒట్టుకురాకపోతే, ఆకలికి ఆళ్ళిద్దరూ మాడి సవ్వడం కాయం. లోపల వద్దు వద్దని యెంత అనుకున్నా, హాన్ కాడికి ఎళ్ళక తప్పలేదు. ఆబాబు యింటికాడ కెళ్ళి, ఇంటి ముందు గేటు సూసీసరికి నాకు కాళ్లు గజగజ వొణికినాయి. గాని యెళ్ళక తప్పదు. నాకడుపున బుట్టిన పిల్లల కోసం నానెళ్ళక తప్పదు. లోపలికిలాగ అడుగెట్టినానో నేదో, ఎక్కణ్నించి ఒచ్చి నాయో పెద్దపులుల్నాగ ఒచ్చి మీదపడినాయి నాలుగు జాగిలాలు! నాయి ప్రాణాలు పైనే పోనాయి!! ఇంతట్లోన్నే లీచింగ్-షాన్* ఒచ్చి, 'ఏట్రా, దరిద్రగొట్టోడా! అంత మురికి గుడ్డలేసుకోని ఏటలాగ లోపల్లోపలికి వొచ్చేస్తన్నావు?' అన్నాడు. నోపలినించి హానుబాబు గొంతు యినపడింది అప్పుడు. 'ఒరే, లీ! ఎవర్రా అదీ?' అన్నాడు. 'చావోగాడు బాబూ!' అన్నాడు లీగాడు. 'ఏంగావాలో పాపం అడుగూ!' అన్నాడు బాబు నోపట్నించే. 'సొమ్ము అప్పుగావాలట బాబూ!' అన్నాడు లీగాడు. ఆ మాట ఇనగానే కిటికీనొంచి బెయిటికి తొంగిసూసేడు హానుబాబు. 'ఓహో, చావోగారా? దయసేయండి. తమరు శానా గొప్పోళ్లుగదండి. ఈ పేదోడి ఇంటికెందుకొచ్చేరండి?' అని, 'నీకు అప్పు యియ్యకపోతే, నీ పెల్లానికి అన్నేయం సేసినోణ్ని అవుతాన్రా!' అన్నాడాబాబు. లీగాడు ఎకిలిగాడీనవ్వు నవ్వేడు. నాకు ఒల్లంతా కొరంగుండ రాసి నట్టు మండింది. అనాగే నిల్చున్నాను. మల్లీ అన్నాడు హాను: 'ఏంటీ, అప్పుగా వాలా? ఓ, అలాగే ఒట్టుకెళ్లు. నీకెంతగావాలంటె అంతా ఇస్తాను. గాని ఓ సిన్న సరతుంది' అని ఆగేడు. నానేటిసెప్తానో అని సూసేడు. తిండికిలేక మలమల మాడు

* హాన్‌గారి అంగరక్షకుడు

తున్న నా పిల్లలే నా కల్లలో మెదుల్తున్నారు. అందుసేత, 'సరే. ఆసరతేదో సెలవియ్యండి' అన్నాను. పిడుగు ఏసినట్టు సెప్పేడు హాను బాబు 'సరతు!' 'రేత్రికి నీ పెల్లాన్ని ఇక్కడికి పంపించు దబ్బిస్తాను' అన్నాడు. నాకు గుండెల్లో ఎయ్యిగునపాల్తో కుల్లబొడిసీసినా అంత బాదపడకపోదును. గుండెపగిలి సచ్చిపోతానేఁవోననిపించింది. మారుమాటనకండా ఎనక్కి తిరిగి పోయేను. లీగాడు నామీదికి రెండు కుక్కల్ని వుసిగొలిపినాడు. అయి. నా సొక్కాలాగూ సింపీసినాయి. నా పిక్కలకాడ కండ ఎక్కటీకీసినాయి. ఆ మరుసటి దినం నా ఆదురుస్టం బావుంది. అడివిలోకెలితే శెవలపిల్లి ఒకటి దొరికింది. శానా రోజుల్తరవాత దొరికిన తిండిగదా, అవురావురుమని ఇంటిల్లపాదిఁపీ తింటున్నాం. సరిగ్గ ఇలాగ రెండుముద్దలు నోట్లో ఎట్టుకున్నాఁవో నేదో నన్ను లేబరు కేంపుకి లాక్కుపోతాఁవని ఒచ్చేసినారు యములాళ్లు! గుండెలు పగిలీనాగ ఏడ్సేరు నా పెల్లాం పిల్లలూ! కేంపునించి తిరిగొచ్చేసరికి ఇక్కడ నాకుటుంబం అంతా సర్వనాసినమయిపోనాది. నా నెళ్ళిపోనాక నా బార్య, హాన్‌బాబు బాద తప్పించుకుందికని మొగమంతా రక్కీసుకుని అసహ్యంగ సేసీసుకుంది. తల్లీ పిల్లలూ ముస్టెత్తుకొని ఈదులమ్మట తిరుగుతున్నారు. నాసిన్నకూతురు సచ్చిపోనాది. ఆకలిబాదకి బలైపోనాది. మరోసారి, నాసేత గాజుపెంకులమీన మోకాల్లు ఏయించినాడు హానుబాబు! మునుకులు సెక్కుపోయి నెత్తురు దారలు కట్టింది. కత్తుల ఒంతినమీన నిలబెట్టినట్టనిపించింది నాకు. నేలంతా నెత్తురుమయమయిపోనాది...." అంటూ కాలుఎత్తి 'ఇదుగో సూడండి! ఈ మచ్చలు. ఇయిగో ఇక్కడ.... ఇక్కడ....!' అంటూ చూపించేడు చావో.

జనమంతా కొంచెం ముందుకి వంగి అతని గాయాల మచ్చల్ని చూసేరు. ఇంత సేపూ తన బాధల గాథలు చెప్పి, ఆతరవాత ఆనాటి నెత్తుటి గాయాల మాయనిమచ్చల్ని చూసేదేమో, చావోకి ఉద్రేకం ఉవ్వొంగింది. గంభీరంగా ఇలాగన్నాడు.

"నేస్తాల్లారా! ఈ బాబులందరూ మనోళ్ళే! అడిమీన నా పగ సల్లార్చుకుంటాను. నాను పోగొట్టుకున్నది తిరిగి సాదించుకుంటాను. వూరికి ముగుడునాగ వుండి జనాన్ని శితకబాదలేదా, హాన్‌బాబు. అడిశీత తన్నులుతిన్నవోళ్లు ఎంతమందుంటారు?"

"లెక్క, పత్రిఁవా?" అన్నాడు ఓల్‌సన్.

"అవున్నిజఁవే. శానామంది తిన్నారు" అన్నాడు లియూ తె-షాన్.

"ఈ వూర్లో మూడుకుటుంబాల్లో* పసిపిల్లల సావులకి కారకుడెవుడు? సెప్పండి" అడిగేడు చావో.

---

* 'కూ', 'చెన్', 'హువాంగ్' అనే ముగ్గురి కుటుంబాల్లో.

జవాబు చెప్పడానికి ఎవ్వరూ సాహసించలేదు. ఇద్దరు ముగ్గురు మనుషులు బైటికి జారుకోడానికి నెమ్మదిగా ద్వారం దగ్గిరకి చేరేరు. గదంతటా మరోసారి నిశ్శబ్దం ఆవరించింది. సమావేశాన్ని నీళ్ళుగార్పించడానికి ఈ అవకాశాన్ని కొందరు వాడుకుంటారనిపించింది సియావోకి. వెంటనే చావోని మరో ప్రశ్న అడగమన్నాడు.

"హాన్‌బాబు మంచోడా, సెడ్డోడా?" అడిగేడు చావో.

"సెడ్డోడు!" గది మారుమోగింది.

"ఆడు మనందరి బతుకుల్లోనూ చిచ్చుపెట్టి, మనల్ని బూడిద సేసినాడుగదా? అందుకు మనం ఆడికి తగిన సాస్తి సెయ్యాల్లా, వద్దా?"

"సెయ్యాలి! సెయ్యాలి!!" అన్నారు చాలామంది.

"ఆడిపని పట్టడానికి మరి మనకి కలేజాలున్నాయా?" అన్నాడు చావో మళ్ళీ.

"ఉన్నాయి! ఉన్నాయి!!" ముక్తకంఠంతో అరిచేరంతా.

"మనకి కలేజాలెందుకు లేవూ? వున్నాయి కావల్సినన్ని వున్నాయి" అన్నాడు లియూ తె-షాన్.

"అయితే, మీకందరికీ హాన్‌గాడిమీద ఎదురు తిరగడానికి ధైర్యం వున్నాదంటారు? సరే అయితే, నాతో నడండి! విప్లవం అంటే వుపన్యాసాలిచ్చుకోడం గాదు. పనిసెయ్యాల పని! మనందరం ఎళ్ళి పట్టుకుందాం ఆ నంజికొడుకుని! అణ్ణి పట్టి, తాళ్లతో కట్టిపడేస్తే జనం ధైర్యంగా ఆడిమీదున్న అక్కసు ఎళ్ళగక్కుకుంటారు."

ఈ మాటలు గబగబా అనేసి, హడావుడిగా జనాన్ని తప్పించుకొంటూ ద్వారం దగ్గిరికి నడిచేడు చావో. నుదుటిమీద చెమట కోటుతో తుడుచుకొన్నాడు. ఇందాక బొత్తాలు విప్పేసిన కోటు అలాగే వేలాడుతూవుంది.

స్కూలు గదంతా గోలగోలగా తయారయింది. జనం అటూ ఇటూ పరుగులు తీస్తున్నారు. ఎక్కడపడితే అక్కడ నలుగురుచేరి ఏవేవో వాదించేసుకొంటున్నారు. రకరకాల గొంతులూ; రకరకాల భావాలూను.

"పదండెస్, చావో మాఁవతోటి ఎళ్ళి, ఆ దొంగ తొత్తుకొడుకుని ఒట్టుకొద్దాం" అంటూ అరిచేరు కొంతమంది యువకులు.

కొందరు నడిమి వయసువాళ్ళు కూడా, "సరే, బాగున్నాది. పదండెళదాం!" అన్నారు.

"ఇంత రాత్రప్పుడే బెల్తారు? రేపొద్దున్న ఎళ్తే గాదా?" అన్నారు కొందరు వృద్ధులు. వాళ్ళకి కళ్ళు మూతలు పడిపోతున్నాయి.

''జనంవంతా ఏటనుకుంటన్నారో సెప్పడానికి నువ్వెవడివి? అయినా కొంద రెదవల్ని నమ్మలేం. తిన్న ఇంటికే వాసాలు నెక్కెడతారు. ఇక్కడేంవో మన మాట మనకి అప్పగించి అక్కడికెల్లి హాన్‌గాడు తప్పించుకు పారిపోడానికి సాయం సేస్తారు. అందుసేత మనం ఎంటనే బయల్దేరాల!'' అన్నారు యువకులు కొందరు.

వాళ్ళలా మాటాడుతూవుంటే, లీ చెన్-చియాంగ్‌కి ఒంటిమీద తేళ్లూ జెర్రులూ పాకినట్టుంది. ఆ సంగతి సియావో కనిపెట్టకపోలేదు.

''ఆఁ, ఆడెక్కడికి పారిపోతాడు? అయినా ఇప్పుడు సుట్టుపక్కల అన్నిసోట్లా కమ్యూనిస్టులదేగా పెత్తనం?'' అన్నారు మరికొందరు. వాళ్ళకి నిద్ర ముంచుకొస్తోంది. ఈ గొడవేదో వేగంగా తేలిపోతే, ఇళ్ళకిపోయి పడుకుందామనివుంది వాళ్ళకి.

''ఏటీ? ఆడు పారిపోతాడా? పారిపోనీ. ఆడైతే పారిపోతాడుగాని, ఆడి ఇల్లూ ఆడి ఆస్తీ ఆవెక్కడికీ పారిపోనేవుగదా! బైరాగోడు పోతేపోతాడుగాని మఠం ఎక్కడికి పోద్ది?'' అన్నారు మరెవరో.

"సరే, ఇక నీకబుర్లు సాలిద్దాం. ధైర్యంవున్నోళ్ళంతా ఎంటనే బయల్దేరి నాతో రండి. పిరికి సన్నాసిగాళ్లంతా ఇళ్ళకిపోయి పెళ్ళంపక్కలో తొంగోండి" అంటూ అరిచేడు చావో. "ఓ లియూ తాతా! జల్దీగా ఇంటికి పరుగుతియ్"అన్నాడు చల్లగా జారుకోబోతున్న లియూతె-షాన్‌ని వుద్దేశించి. లియూ ముఖమంతా తెల్లగా పాలిపోయింది. ఎందుకో తెగభయపడి పోతున్నాడతను. తన భయంచూస్తే జనం నవ్వుతారని, అతి ప్రయత్నంమీద నవ్వుమొహం చేసుకొని,

"ఏం, నానెందుకింటికెల్లాలి? మీరేనేటి హన్‌ని పట్టుకోగలిగిన మొగోళ్ళు?" అన్నాడు.

భూసంస్కరణ కార్యకర్తలంతా చావోనే సమర్థించేరు. అక్కడ పరిస్థితులు అంత త్వరగా ఓ కొలిక్కి రావడంతో వాళ్ళంతా చాలా సంతోషించేరు. చావో బయల్దేరుతూవుంటే, అతనివెనకే కొందరు జనం బయర్దేరేరు. వాళ్ళని చూపిస్తూ, 'చూసేవా చాంగ్! కర్షకులంటే ఏంవిటనుకున్నావ్?'అన్నాడు లియూ షెంగ్. చాంగ్* తో. తన వుత్సాహంలో చాంగ్‌కూడా కర్షకుడేనన్న సంగతి మర్చిపోయేడు లియూ.

జనాన్ని తప్పించుకొని ద్వారం దగ్గిరికి వెళ్లేడు వాంగ్. తన భుజంమీదవున్న ఆటోమేటిక్ తుపాకీ తీసి చావోకి ఇచ్చి దగ్గిర వుంచమన్నాడు.

"ఇది నీ దగ్గిరుంచు. అవసరం రావచ్చు. ఆ లంజాకొడుకు దగ్గిర తుపాకులు వుండే వుంటాయి. అన్నట్టు నీకు తుపాకీ పేల్చడంవచ్చా?" అని అడిగేడు.

---

* చాంగ్ సెక్షన్ లీడర్.

"ఈ రకం తుపాకి పేల్చడం రాదుబాబూ!" అన్నాడు చావో.

"తుపాకీ పేల్చడం నేర్చుకోడం ఎంతసేపు? రా. నేను చూపిస్తాను" అంటూ చావోని అవతలికి తీసికెళ్ళేడు. తుపాకీలో గుళ్ళునింపి, చావో చేతికిచ్చి "ఇదుగో ఇక్కడ నొక్కు. మళ్ళీ నొక్కుతే మరో గుండు అంతే!" తలవూపేడు చావో. తుపాకీని భుజానికి తగిలించుకొని బయల్దేరబోయేడు. "ఉండు, ఒక్కక్షణం ఆగు! ఎందుకైనా మంచిది ఓతాడుకూడా తీసికెళ్ళు!" అన్నాడువాంగ్. గబగబా లోపలికివెళ్ళి తన బెడ్డింగు తాడు విప్పి తీసుకొచ్చి ఇచ్చేడు. "వాణ్ణి గట్టిగా కట్టాలి సుమా! పరమ కేటు నాకొడుకు. జాగ్రత్త. వాడి మాటలు నమ్మకు. దొరికితే వాణ్ణి విడిచిపెట్టకు" అన్నాడు.

ఈ ఉత్సాహ ఉద్రేకాలమధ్య సియావో సాధ్యమైనంత నిదానంగా వుండడానికి ప్రయత్నిస్తున్నాడు. చావో దిటవు చూసి అతను చాలా సంతోషించేడు. కాని పార్టీ సభ్యుడుగా తనకి కొన్ని బాధ్యతలున్నాయి. అందుచేత రాగద్వేషాలకతీతంగా తను ఈ విషయాలన్నీ క్షుణ్ణంగా పరిశీలన చెయ్యాలి. టోపీ ఓ చేత్తో పట్టుకొని గదిలో ఓ మూల శెగపచార్లు చేస్తున్నాడతను. మధ్య మధ్యలో అలవాటుప్రకారం తన మున్నటి గుండు గోక్కుంటూ వుంటాడు ... ఇప్పుడున్న పరిస్థితుల్లో చావో మరీ తొందరపాటుగా ప్రవర్తిస్తున్నాడా? జనానికి యింకా అంత చైతన్యం రాలేదు. అలాగని చెప్పి ఉత్సాహవంతులైన ప్రజల్ని నీరుగార్చడంకూడా తప్పే. సరే, ఏది ఏమైనా ఆ బుగ తని పట్టి బంధించడంమాత్రం అవసరం. చావో చెప్పినట్టు వాణ్ణి కట్టిపడేస్తే జనం ధైర్యంగా వాడిమీదవున్న ఆక్కసు వెళ్లగక్కుకుంటారు. సరే, వాణ్ణి పట్టి బంధించేం. తరవాత ఏంజరుగుతుంది? ఇలా ఆలోచిస్తూ వుండగా, పూర్వం ఒక సాయుధదళాన్ని హాన్ ఆర్గనైజ్ చేసేదన్న సంగతి జ్ఞాపకం వచ్చింది సియావోకి అంచేత అతనిదగ్గిర తుపాకులుండొచ్చుననిపించింది. వెంటనే చావోని ఒక్కక్షణం ఆగమని పురమాయించేడు. సెక్షన్ లీడరు చాంగ్‌ని పిలిచి.

"చావోతోపాటు నువ్వుకూడా వెళ్లు. నీతోపాటు ఓ ఎనిమిదిమందిని తీసుకెళ్లు. అక్కడికివెళ్లేక గేటుబైట నలుగుర్ని వుంచు. లోపలికి మిగతా నలుగురూ వెళ్ళండి. తుపాకులు ఏక్షణంలోనైనా పలకడానికి సిద్ధంగావుంచుకోండి" అన్నాడు సియావో.

తరవాత అంతా నెమ్మదిగా వెళ్ళిపోయేరు. సియావో ఒక్కడేకూచొని జరిగిన సమావేశాన్నంతటినీ ఒక్కసారి వెనక్కితిరిగి చూసుకొన్నాడు.... మొత్తంమీద ఫరవా లేదు. బాగానే జరిగింది. ఒక్క తీన్‌తాతే ఏదో దాస్తున్నాడు. అతనికి గొప్ప అన్యాయమేదో జరిగివుంటుంది. రేపు వెళ్ళి అతన్నోసారి కలుస్తాను.... అనుకొన్నాడతను.

తరవాత వాన్*ని పిలిచి "కొంచెం నీళ్లు తెచ్చిపెడతావా? చన్నీళ్ళయినా ఫరవాలేదు. మూడురోజుల్నించీ మొహంకూడా కడుక్కోలేదు నేను. నాక్కొంచెం నీళ్లు తెచ్చిపెట్టి, తరవాత నువ్వుకూడా వెళ్లు మనవాళ్ళదగ్గిరికి" అన్నాడు.

హాన్‌గారి భవంతివైపు వాళ్ళంతా నడవసాగేరు. అందరికన్న ముందు పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ వెళ్తున్నాడు చావో. చీకట్లు జాగా ముసురుకొన్నాయి. మంచు మెత్తగా కురుస్తోంది. ఆకాశంలో పాలపుంత లక్షలాది నక్షత్రాలతో మిలమిల మెరుస్తోంది. కప్పలూ, కీచురాళ్లూ పోటీలుపడి తెగ గోల చేస్తున్నాయి. అడుగుల చప్పుడువిని చెట్లమీద పిచికలు ఒక్కసారి గూళ్లువదిలి రెక్కలు విదిలించి మళ్ళీ గూళ్ళ లో దూరిపోతున్నాయి. ఆ కదలికకి ఆకులమీదవున్న మంచుబిందువులు జలజలా రాలేయి.

ఆ చీకట్లో చల్లగా జారుకొన్నాడు లీ చెన్-చియాంగ్. అడ్డుదారంటు హాన్‌గారి భవనానికి గబగబా వెళ్ళి పోయేడు.

సగం దూరం వెళ్ళేక కొంచెం కొంచెం వెనక్కితగ్గి, ఆఖరికి ఎవ్వరూ చూడ కుండా రోడ్డుప్రక్కనున్న ఓ పాకలో జొరబడ్డాడు లియాతె-షాన్. అడుగులచప్పుడు దూరమవడం గమనించి నెమ్మదిగా బైటికివచ్చి, అటూఇటూ చూసి రెండుచేతులమధ్యా తలదాచుకొని యింటికేసి పరుగులు తీసేడతను.

మిగతావాళ్ళంతా ముందుకు సాగిపోయేరు. టకటకా అడుగులు వేసుకొంటూ, ఓల్డ్‌సన్, తీన్‌తాతా— ఇద్దరికీ పాపం వయసువల్ల కీళ్లు పట్టేసినా, ఎలాగోలాగ తంటాలుపడి వాళ్ళతోకలిసి నడుస్తున్నారు. ఎప్పటికప్పుడు వెనకబడిపోడం; మళ్ళీ అందుకుందికి పరుగుతియ్యడం. చుక్కలవెలుగులో తుపాకులు మిలమిల మెరిసేయి.

రోడ్డుపొడవునా కుక్కలు తెగ మొరిగేయి. గాఢసుషుప్తిలోవున్న వూరి ప్రజ లందర్నీ నిద్రలేపేయి. మరికొద్దిసేపట్లోనే వూరంతా ఆట్టుడికినట్టు వుడికిపోయింది.

---

* 'వాన్' సియావో అంగరక్షకుడు

(సశేషం)

## విప్లవ సందేశం

సుబ్బారావ్ పాణిగ్రాహి

నాన్నా! విశ్వం! ఈ విశ్వం నీదే!
నీతరంలో ఈ విశ్వానికి నిశ్చయంగా విముక్తి
హద్దులులేని విశాల విశ్వం
విశ్వమానవ సౌభ్రాతృత్వం
ఆ తత్వం కావాలనే ఈ మహత్తర పోరాటం

ఇది సత్యం
నీ తరంలో విశ్వానికి విముక్తి
మున్నూరు కోట్ల మానవులం
అరుణ పతాకచ్ఛాయల్లో
ఆనంద నిలయంలో
అంధకారం, అంధత్వంలేని అనంత సమాజంలో
అనుభవిస్తాం తప్పక అమరసౌఖ్యం......

అందుకే నిన్ను పిలుచుకున్నాం బాబూ!
పేరుపెట్టి విశ్వం! విశ్వం! అని.
ఈనాటి ప్రపంచం రెక్కలులేని విహంగం
హద్దులుపెట్టి సరిహద్దుల పేరున
దేశానికీ, దేశానికీమధ్య ద్వేషం
భాగ్యవంతులు నిర్భాగ్యులను
దోచుకోవడం
కూడబెట్టి ధనం దాచుకోవడం
ఏడంతస్తుల మేడల్లో కులికే దొరలైతే
కోట్లాది ప్రజలకు నీడదొరకని
జగత్తు మహత్తు పేరున
సాములోర్లనే సోమరిపోతులకు విలువయిచ్చే
ఎనుబోతులూ. అబోతులూ పాలిస్తున్న జగత్తు

శ్రమకు ఫలితం దొరకదు
పరిశ్రమలకు ఒక్కడే యజమాని
కాని కడుపుకు కూడుకోసం
కాలికి బలపం కట్టితిరిగినా
కూలిదొరకని జగత్తు
ఎక్కడైనా దొరికినా
రెక్కలు ముక్కలవడమే గాని
ఒక్కనాడైనా తృప్తిగా భోంచేసి ఎరుగడు
ఆలి పిల్లలకు పస్తు తాను పస్తు... పస్తు.
అస్తు బిస్తు జీవితాలతో
పచ్చి అంధకార బంధురంలో తచ్చాడు తున్నాడు–
దారిదొరక్క మానవుడు.

జగత్తులో. మహత్తర మైనా నిర్మాత
ప్రపంచ పీడిత జననేత
కామ్రేడ్ మావో సేటుంగ్
ఆలోచన వెలిగించింది
అంధకార విశ్వంలో ఓ అరుణకాంతి
ఓ అరుణ కిరణం
అందుకున్నారు, ఆర్తులంతా!
అందుకే విశ్వంలో
అనంతకోటి అగ్నిపర్వతాలు
బ్రద్దలవుతున్నాయి
విప్లవ పోరాటాలు విశ్వంలో అంతటా చెలరేగాయి
కుళ్ళు సమాజంనుండి బైటపడాలని
కళ్ళు తెరచింది జగత్తులోని వీరజనత
అదే మన దేశంలో ప్రారంభమయింది
పయనిస్తుంది

నాన్నా! విశ్వం!
మీ నాన్నను కట్టి కాల్చి చంపిందిరా ఈ కరకు ప్రభుత్వం
భీరుల్లా కిరాతక మూక.

ఆ వీరుణ్ణి చుట్టుముట్టి
చేతులు కట్టి అతనితోపాటు
మరి ఆరుగురు దేశభక్తుల్నీ,
వీరపుత్రుల్నీ
గుండెలపై గురిచూచి తుపాకి గుళ్ళు పేల్చారా

నాన్నా! విశ్వం!
ఎవరనుకున్నావ్ మీనాన్న?
భారత విప్లవ రథసారథి,
వీర గెరిల్లాల సైన్యాధిపతి
మన శ్రీకాకుళం పోరాటానికి
శ్రీకారం చుట్టిన వారిలో ఒక వీరుడు
మావో ఆలోచనావిధానాన్ని
ఆచరణలో చూపించిన
ఆదర్శజీవి - అతడే,
మా వీర కృష్ణమూర్తి
మీ నాన్న కృష్ణమూర్తి

దుర్మార్గ పోలీసులు అతన్ని చుట్టుముట్టి
తుపాకీ ఎక్కుపెడుతున్నప్పుడు
జంకలేదు, గొంకలేదు
జంకుతున్న పోలీసుమూకకు
తన ఆశయాన్ని వివరించాడు
మావో ఆలోచనతో మానవ విజయం తథ్యమని
గర్జించాడు
విప్లవం వర్ధిల్లాలి!
ప్రజా విముక్తి కావాలి!!
మావో జిందాబాద్!!!
అనే నినాదాలు
మిన్నుముట్టేలా గర్జించాడు
ఒకటి,
రెండు,

మూడు,
నాలుగు,
ఐదు,
ఆరు,
ఏడో తూటాకు
తనపై ఆశయాన్ని
మనపై వుంచి
సాధించి తీరుతామనే
ఆశతో కన్నుమూశాడు
మా కామ్రేడ్ !
మా నేత !

నాన్నా ! విశ్వం !
చరిత్ర నీపై చాలాభారం మోపిందిరా
మీ నాన్న ఆశయాన్నీ,
నిరుపేదల ఆశల్నీ
సాధించి తీరాలని శాసించిందిరా !

నీకు తెలీదులే నాన్నా !
అట్టే వయసులేదు నీకు
తోటివీరులతో కొండలు,
కారడవులు తిరిగావు
నిర్మలమైన నీతల్లి ఒడిలో
కేరింతలు కొట్టావ్ !
నోటి మాటలు తెలియని
చిరు ప్రాయంలోనే
గెరిల్లా జీవితం అనుభవించావు
అమ్మా అని పలుకైనారాని
అమాయకపు వయసులోనే
కొండలు, బండలు ఎగబ్రాకావు
మాకూ, నీకూ తెలియని
ఈ జగత్తులోనే లేని

యేదో భాషలో పిడికిలి
బిగిస్తూ నినాదాలు సాగించావు

అందుకే

నాన్నా! విశ్వం!
ఈ విశ్వం నీదే!
మీ నాన్న మరణించినా
అతని ఆశయం బ్రతికేవుంది
ఆవేశంతో ఆ ఆశయాన్ని
పూర్తి చెయ్యాలి
ఈ విశ్వాన్ని విముక్తి చేయాలి
నాన్నా! విశ్వం!
నీకూ నీతరం వారికీ
ఇదే నా విప్లవ సందేశం.

[కామ్రేడ్ పంచాది కృష్ణమూర్తినీ, మరో ఆరుగురు కామ్రేడ్సునూ కిరాయి పోలీసు మూకలు కాల్చిచంపినప్పుడు ఆ ఆవేశంతో అమరజీవి, గాయకుడూ, కళాకారుడూ, రచయితా, సహచరుడూ అయిన కామ్రేడ్ పాణిగ్రాహి సుబ్బారావ్ అప్పటికింకా నడవడంకూడా రాని చిరంజీవి చిన్నారి విశ్వం నుద్దేశించి వ్రాసిన వచన కవిత— చిన్నారి విశ్వం - పంచాది కృష్ణమూర్తి, నిర్మలా దంపతుల ముద్దుబిడ.]

# గెరిల్లా పుట్టిన దినం

ప్రసాద్

చావటం పుట్టటం
అంటే అర్థం తెలియని చవటలు
నిన్ను చంపామని చంకలు గుద్దుకుంటున్నారు
నేలంతా నిండిన నిన్ను
ఏమూల రక్కి–
చచ్చాడు పో అని సంబరపడుతున్నారు

నీ తల చితక్కొట్టి
నీ కీళ్లు విరగ్గొట్టి
వొళ్లంతా తూట్లమయంచేసి
రక్తాన్ని తప్ప రహస్యాన్ని రాబట్టలేక
నీ వజ్రి సంకల్పాన్ని తడవి
తమ నిష్ప్రియోజనాన్ని తలచి
బిక్కచచ్చి నిలచిన
ఆ కిరాయి కుక్కల గుండెల్లోకి
"ప్రజా సాయుధ గెరిల్లాలు
మీ అంతు తేలుస్తారని" బాణాలొదిలావు

చేరువౌతున్న మృత్యువు గుండెపై చెయ్యేసి
అరనిమిషం ఆపి
"ప్రిజలజేయులు"
"విప్లవం వర్ధిల్లాలి"
"మావో ఆలోచనా విధానం వర్ధిల్లాలి"
అని కొండలు, శత్రువు గుండెలూ
అదిరేలా గర్జించి కన్నుమూసావు
నీ ఆలోచనలు అడవిలో చిగురించి
నీవు మాత్రిం మాకు లేకుండాపోయావు

నీవు చచ్చి
వేలకొద్ది వీరుల పుట్టించావు
మరి నీది చావెలా అవుతుంది ?

నిజం
నీ పుట్టిన దినం
నీ గుండెల్లో బాయ్‌నెట్ కుచ్చుకున్న దినం
నీ రక్తం తడిసిన మట్టినుండి
ఎర్ర పూలు పూసిన దినం
నిజం
నీకదే పుట్టిన దినం

నీ చావుకబురు విని
తమ భుజాలపై స్వారిచేస్తూ
తమ భుక్తిపై బ్రతికే నాయకుడిగా
తమ వస్తుల్లో పాలుపంచుకొని
కష్టాల్లో వెన్నుకాయడానికి
ఆస్తిని ఆనందాన్ని
అమ్మని నాన్నని
వయసులోవున్న పెళ్లాన్ని కాదని
తమ గూడెంలో గుండెల్లో కలిసిన
గెరిల్లాగా
ఇప్పుడిప్పుడే గుర్తిస్తున్న కూలీజనం
కంటతడిపెట్టడమే కాదు
నీవెత్తిన జండా
ఇంకా సమున్నతంగా ఎగరేస్తామని
నీవు చూపిన బాటనే పయనిస్తామని
ప్రతిజ్ఞ చేస్తున్నారు.

## చెరబండరాజు - **ముట్టడి**

కవిత్వాన్ని, జీవితాన్ని విప్లవీకరించటానికి విప్లవ రచయితల సంఘం ఏర్పడింది. రాజకీయాలు, మతం, గతమృత పదార్థం, కళలు, విద్యావిధానంమొదలయిన సమాజ వుపరితలం మీద సిద్ధాంత ఆయుధంతో తిరుగుబాటు చేయటం విప్లవ కవిత్వ ఆశయం. వామపక్ష అవకాశవాదుల్ని, వ్యక్తిగత ఆడంబరవాదుల్ని, బూర్జువా సోషలిస్టుల్ని, ఎర్రజెండా పట్టుకొని ఎర్రజెండాను ఓడించాలనుకునే కుహనా మార్క్సిస్టుల్ని సాంస్కృతిక రంగంలో విప్లవ రచయితల సంఘం అన్నివిధాలా ఎదుర్కొంటుంది. కవిత్వాన్ని శాస్త్రీయ ప్రజాపోరాటాలకి అంకితంచేయటమే కవిత్వాన్ని విప్లవీకరించటం అవుతుంది. ఈ ప్రయాణంలో కవిత్వ శిల్పంలోనూ, వస్తువులోనూ మౌలికమైన మార్పులు అనేకం వస్తాయి. సిద్ధాంతం వూపిరిగా వర్గచైతన్యంతో, అస్తిత్వంలోవున్న తిరోగామి శక్తుల్ని ఖండిస్తూ విస్తృత ప్రజావిప్లవానికి సంఘరంగాల్ని సిద్ధం చేయటమే జీవితాన్ని విప్లవీకరించటం అవుతుంది. ఈవిధమైన పోరాటం, నిర్మాణం విప్లవ కవిత్వానికి ప్రధాన ఆశయాలు.

కవిత్వాన్ని ప్రజాపరం చేయటం అంటే అనుకున్నంత తేలికకాదు. అప్పుడప్పుడు పేదవాళ్లని గురించి కన్నీళ్లు కారుస్తూ రాయటం తేలిక. బాధల్లోక్రుంగిపోయే వాళ్ళ సమస్యల్ని పరిష్కరించవలసిందిగా వున్నవాళ్ళను ప్రార్థించటంకూడా తేలికే. నిజమైన ప్రజాకవిత్వం రాయాలంటే కవిత్వ స్వభావంలోనేకాకుండా కవి స్వభావంలో కూడా మార్పు రావాలి. కవి అంతరంగ సంస్కారం, ఆలోచనాధోరణి పూర్తిగా శ్రమజీవుల్తో మమేకం చెందటం చాలా అవసరం. చాంచల్యాన్ని, మధ్యతరగతి స్పృహని త్యజించి సాంఘిక ఆచరణలో వర్గపరివర్తనం సాధించినప్పుడే కవిస్వభావం మారుతుంది. తన అనుభూతులు, ఆశయాలు, ఆవేశాలు శ్రామికవర్గ చైతన్యంతో కలిసిపోవాలి. కార్మిక-రైతాంగంలో వొకడుగా కలిసిపోవలసిన అవసరాన్ని, అవశ్యకతని గుర్తించినపుడు కవి చైతన్యవంతుడు కాగలడు. ఎందుకనంటే "In its struggle for power the proletariat has no other weapon but organisation" -Lenin. రాజకీయ అధికారంకోసం చేసే పోరాటంలో కార్మిక, కర్షక, యువ విప్లవకారులకు చైతన్యమే ప్రధాన ఆయుధం. ఇలాంటి చైతన్యాన్ని పొందినప్పుడే కవిస్వభావంలో ప్రజాపరమైన పరివర్తనం సాధ్యం అవుతుంది. చెరబండరాజు యీ రకం శాస్త్రీయమైన చైతన్యం పొందుతున్న విప్లవకవి ప్రజాపోరాటాలు కవిచైతన్యాన్ని

విప్లవీకరిస్తాయి. ఇటు పోరాటస్వభావం, అటు చైతన్యం నిరంతరం మారుతుంటా యనే సత్యాన్ని యెప్పుడూ విస్మరించకూడదు. శ్రామిక చైతన్యం ఏ దశలోవుందో, పోరాటం ఏరూపానికి చేరుతుందో కవి చైతన్యంకూడా ఆ దశకు, ఆ రూపానికి చేరుకో వటం విప్లవ చైతన్యం. ఈ విప్లవ చైతన్యంతో తీవ్ర ప్రభావితుడై విప్లవ కవిత్వాన్ని సృష్టించినాడు చెరబండరాజు.

చెరబండరాజు వేర్లు గ్రామజీవితంలోనూ, తల యువతరంలోనూ వున్నాయి. నిరుపేదరైతుల, రైతుకూలీల హృదయాలు కెరటాలుగా చెరబండరాజుకవితల్లో స్పంది స్తాయి. భూస్వాములు రైతుల్ని ఎన్నివిధాల క్రూరంగా దోపిడీ చేస్తున్నారో, రైతు జీవితం మొత్తాన్ని వర్గశత్రువులనే నాగుపాములు ఎన్నివిధాల చుట్టుకొనివున్నాయో చెర బండరాజుకు ప్రత్యక్షంగా తెలుసు రైతుల కండలే ఎరువులుగా, రక్తమే నీళ్ళుగా ఏపుగా పెరిగిన పంటని భూస్వాములు ఎంత కఠినంగా, అన్యాయంగా దోపిడిచేస్తారో చెరబండరాజు కవితలో ఒకప్పుడు దీనసంగీతంలా, మరొకప్పుడు భీషణ గర్జనలా విని పిస్తుంది. ఆ పేద పీడిత రైతాంగంతో ప్రేరణని, చైతన్యాన్ని ఆ గ్రామాలనుంచే పొందాడు. 'సరికొత్తరజాకార్లు' కరణం, పటేల్, వర్పంచులు గ్రామాన్నిగుప్పిట్లో పెట్టుకొని పోలీసుల సహాయంతో పరమభీకరంగా దోపిడీచేయటాన్ని అనుభవాలనుంచి స్పష్టంగా చిత్రించాడు. ఇరవయ్యేళ్ళుగడిచినా సామాన్యుని జీవితం మరింత దుర్భర మైందేకానీ వాక వీసం ముందుకుపోలేదు. కనీసం ప్రజాస్వామ్యంలో మానవ విలు వలన్నా మారలేదు. రజాకార్లతో చిత్రహింసలకు గురైనప్రజల్లో యిప్పటికీ ఏ మార్పూ రాకపోవటం, కొమరయ్యలాంటి అమరవీరుల త్యాగాలే మార్గదర్శక జ్యోతు లుగా వాళ్లకి కనిపించటంలో చెరబండరాజు చైతన్యస్వభావం తెలుస్తుంది. వెట్టి చాకిరీ చేయించుకున్న ఫ్యూడల్ భూస్వాములు, అధికవడ్డీలతో శ్రమను దోచుకుంటున్న ఆధు నిక భూస్వాములు పేదరైతుల రక్తంతాగి పాముల్లా విషవర్షం కురిపిస్తున్న సత్యాన్ని చెరబండరాజు గుండెనెత్తురుతీసి చైతన్యం అనే కలంతో రాశాడు.

మావో ఆలోచనావిధానమే ఈనాటి మార్క్సిజం. మార్క్సిజం–లెనినిజాన్ని ఆచరణలో సృజనాత్మకంగా సమన్వయించి జనచైనాను ఆవిష్కరించిన మావో యీ శతాబ్దపు విప్లవ మహోపాధ్యాయుడు. సుదీర్ఘ కార్మిక, రైతాంగ విముక్తి పోరాటాలు దేశదేశాల్లో మావో ఆలోచనా విధానంతో పురోగమిస్తున్నాయి. చైనాలో ఇటీవల మావో తెచ్చిన సాంస్కృతిక విప్లవం ప్రపంచంలో పెడతోవ పడుతున్న అనేక విద్యార్థి, యువకోద్యమాలకు మార్గదర్శకం అయింది. బాధ్యతాయుత యువతరాన్ని

ప్రపంచవ్యాప్తంగా మావో విప్లవ సిద్ధాంతంతో ప్రభావితంచేశాడు. ఇటు కార్మిక, రైతాంగం, అటు యువతరం ఏకమై ప్రజాపోరాటాల్లో పురోగమిస్తున్నాయి. ఈ పురోగమన విప్లవోద్యమాలే చెరబండరాజు కవితకు ప్రేరణలు. నిరాయుధ ప్రజా పోరాటాలు, సిద్ధాంత సేతువులేని ఉద్యమాలు, అహింసాత్మక పికెటింగ్‌లు, సత్యాగ్రహాలు, సమ్మెలు విప్లవ శత్రులని ప్రజల్ని నిర్వీర్యులుగాచేసి చేవనుచంపి జావగార్చేవని చెరబండరాజు గ్రహించగలిగాడు. పీడితులు సాయుధులై తిరగబడితేతప్ప వర్గరహిత సమాజం సాధ్యంకాదని, రాజకీయాధికారంలేకుండా శ్రామిక శ్రేయోరాజ్యం రాదని చెరబండరాజు ఖచ్చితంగా గుర్తించాడు. పాలకపక్షం ఎన్ని సంస్కరణలు చేసినా, ఎంత దీనబంధువు పోజు పెట్టినా కార్మిక, రైతాంగానికి రాజకీయాధికారం శాంతియుతంగా అప్పచెపుతుందనుకోవటం భ్రమ.

"నిరాయుధ పోరాటం మరణానికి మారుపేరు
కర్రా నాగలి పారా పట్టండి
ఎత్తిన గునపాలు క్రియాశూన్యంగా ఎప్పుడూ దించకండి"

శాంతియుత పోరాటాలు భిక్షాపాత్రలలాంటివి. చిన్నచిన్న రాయితీల కోసం పోరాటం చేయటంతో కార్మిక-రైతాంగంలో చైతన్యం చప్పబడిపోయింది. రాజకీయ పోరాటమే శ్రామిక సమస్యలకి నిజమైన పరిష్కారమార్గం.

"తెగించనిదే జయించలేమని
రిక్తహస్తాలతో విముక్తి లేదని"
"ఇరవైఒకటో శతాబ్దం పాడబోయే
సామ్యవాద బృంద గీతానికి స్వరకల్పన
యువతరం నరాలమీద సాగుతోంది"

వర్గసమాజాన్ని నాశనం చేయటానికి తరలిస్తున్న కిరణాయుధ సూర్యుల అరుణతరం చెరబండరాజు కవిత్వానికి అగ్నిజ్వాలలు.

సాయుధ పోరాట ఆవశ్యకతని ఒక నినాదంగా, ఒక రాజకీయ అవసరంగా మాత్రమే చెప్పటం పాక్షిక చైతన్యం అవుతుంది. ఆమోదముద్ర ఒకటే చాలదు. అభిప్రాయప్రకటనమే చైతన్యంకాదు. జీవితంలోంచి దాని అనివార్యతను ప్రదర్శించ కలగాలి. వాస్తవికత నుంచి చిత్రణ మెరవాలి. చెరబండరాజు పీడితజనసందోహపు జీవన పరిస్థితులనుంచి అంతిమ ఆశయ ఆవశ్యకతను, తక్షణ ఆచరణాత్మకతను అలలు అలలుగా అల్లుతాడు, మరీ అతిశయోక్తుల్లో, వూహాపోహల్లో కృత్రిమంగా

వుండక స్వచ్ఛజీవనరాగంలోనే విప్లవరాగకృతి చేస్తాడు. కవిత్వంలో యితర విప్లవ కవులు సాధించలేని వైవిధ్యాన్ని సాధించాడు. ఈవిషయంలో ముఖ్యంగా యువవిప్లవ కవులు చెరబండరాజునుంచీ నేర్చుకోవలసింది చాలావుంది. నినాదమనే అగ్నిపుష్పం జీవితానుభవ వృక్షానికి వికసించిన ధోరణిలో చిత్రించి నప్పుడే బలమైన ప్రభావం చేయగలుగుతుంది. కూలిరాకపోతే కొంపలో పొయ్యిరాజుకోదు. ఎన్ని వుపవాసాలున్నా ఎప్పుడోవొకసారి అర్ధాకలిని తీర్చుకోటానికి రావలసిన కూలిడబ్బుల్ని ఇమ్మని ఖచ్చితంగా అడిగితే తిరుగుబాటుగా చిత్రించి 'నక్సలైట్' పేరుపెట్టి చంపేశారు. అతని భార్యాపిల్లలు అనాధులై నిస్సహాయులయ్యారు. భర్తను కోల్పోయిన దీనస్త్రీ ఆవేదన "రాయిరప్పకు సెప్పనా". ఈ రచనలో "వురితాడునవుదునా"అనే ఆలోచనరావటానికి కారణమైన అనుభవాలన్నీ బలంగా నిర్వహించాడు ఈ పరిస్థితుల్లో "వురిపోసుకుందునా, వురితాడునవుదునా" అనే ఘర్షణ సహజంగా వచ్చింది. వురిపోసుకోమని అహింసా కమ్యూనిస్టులుకూడా అనలేరుకదా! పోనీ చీరరైకలిస్తానన్న వూరిపెద్దకు లొంగిపొమ్మంటారా- ఈస్థితిలో వురితాడు అవటంకంటే పురోగామి సలహా ఎవరివ్వగలరు? జీవితంలో ఇలాంటి వాస్తవికత వున్నదికాబట్టే శ్రామికులు సాయుధులై తిరగబడే అగత్యం వుంది. ఇలాంటి జీవితాన్ని నిశితమైన చైతన్యంతో చెరబండరాజు గుండెతలుపులు కొడుతూ చెపుతాడు.

సాయుధపోరాట ఆవశ్యకతని, అనివార్యతని చిత్రించటంతో విప్లవకవిత్వ ఆశయం పరిపూర్ణంకాదు. ఈ విప్లవ సిద్ధాంతంతో సాంస్కృతిక పోరాటం చేయటంప్రధాన లక్ష్యం ప్రజాపోరాటాలు విస్తృత విప్లవంగా రూపొందే మార్గంలో సాంస్కృతికమైన ఆటంకాలను నిర్మూలించే బాధ్యత విప్లవ రచయితలదే. దీనికి వర్గసమాజ వుపరితలంమీద అవిరామం దాడిచేయవలసి వుంటుంది. రాజకీయాలు, మతం, కళలు, మూఢాచారాల మొదలైనవాటిమీద చెరబండరాజు సహేతుకంగా, సిద్ధాంత నేపథ్యంతో సమంజసమనిపించే విధంగా తిరుగుబాటు చేశాడు. బూర్జువావర్గ అధికారానికి నిచ్చెనలు వేసే ఎన్నికలను, యువతను జావగారుస్తున్న విద్యావిధానాన్ని చెరబండరాజు తీవ్రంగా యెదుర్కొన్నాడు. (మళ్ళీ వస్తున్నాయి మనవూరికి, అమ్మమ్మ ఇందిరమ్మా)

"శాఖోప శాఖలుగా విస్తరిల్లి
వర్ధిల్లుతున్న విషవృక్షం
ఈ ప్రజాస్వామ్యం
సామాన్యుని కౌగిలి కందని
తోదేళ్ళకు ఆశ్రయమిచ్చిన

క్రౌను
రాజ్యాంగం"

అని కుహనా ప్రజాస్వామ్యాన్ని బూటకపు రాజ్యాంగాన్ని నిరసించాడు.

చెరబండరాజు ప్రజాశైలిని సాధించాడు. సంస్కృతపదాల్ని ముఖ్యంగా దీర్ఘ సమాసాల్ని త్యజించటం చాలా ఆరోగ్యకరం. దాదాపు ఎక్కడా జనానికి అర్థంకాని మాటలులేవు. ఎంత సాధారణ పాఠకుడైనా డిక్కనరీచూడాల్సివచ్చే సందర్భం లేదు. తెలంగాణాయాసలో కొన్నిగేయాలు చాలా సహజమైన బలాన్ని సంతరించుకున్నాయి. ఆ'యాస'లోని సజీవ లక్షణం చెరబండరాజు కవితాసంస్కారంలో లీనమై పోయింది. జానపదగేయాల'వరసలు' కొన్ని గేయాల్లో మెరుపుల్లా వెలిగాయి. కవి ఆలోచనలు, సంవేదనలు శ్రమజీవుల ఆలోచనల్తో, సంవేదనల్తో కలిసిపోయినప్పుడే యిలాంటి ప్రజాశైలి సాధ్యమవుతుంది. 'ముట్టడి'లో పాటలు ఈ ప్రజాశైలితోనిండి ప్రజాగేయాలుగా రూపుదిద్దుకున్నాయి. చెరబండరాజు వుపమానాలు, భావప్రతిమలు చాలా సరళంగానూ, కొత్తగానూ వుంటాయి, 'ఓటు కెదిగినబిడ్డ' 'ఇనుపముక్కలు కొడుకులు' 'నీతికథల కోతులు', 'రంగురంగుల విషనాగులు', పడగలిప్పి వొయ్యారాలు పోలు, నృత్యంతో మత్తెక్కిస్తాయి, పొలాలగట్లమీద కండువాలేసుకు కళ్ళద్దాలతో, కఱ్ఱలెగరేస్తూ కసురుతుంటాయి. ఖద్దరుకుఖసాలతో వూరేగుతాయి.' భూపోరాటం, భూసంస్కరణలు, అంతా భౌభౌరాద్ధాంతాలే, చిలుకపలుకుల దేగలు లాంటిపోలికలు కవితా స్ఫూర్తితోనూ పాఠకుణ్ణి ఆవరిస్తాయి. ప్రజాజీవనంనుంచి వుపమానాలు తీసుకోవటం వల్ల చెరబండరాజు శైలికి కాంతి వచ్చింది.

చెరబండరాజు విప్లవ దృక్పథానికి న్యాయం చేయని రచనలు ముఖ్యంగా రెండు వున్నాయి. మొదటిది 'మాలోని మనిషివే' అనే పోలీసుపాట. పోలీసులు పాలకులకు రక్షకవచాలు. బూర్జువాలు ప్రజలమీద ప్రయోగించే పిచ్చికుక్కలు. ప్రత్యక్షంగా ఈ దేశంలో జరిగిన అనేక విద్యార్థి, కార్మిక వుద్యమాల్లో పోలీసులు నిర్వహించిన అమానుషపాత్ర అందరికీ తెలుసు. యజమానికి - ప్రజలకు ఘర్షణ వచ్చినప్పుడల్లా పోలీసులు విచక్షణలేకుండా ప్రజలపై కాల్పులు సాగించిన వుదంతాలు ఈ దేశ జనాభా కంటే ఎక్కువ వున్నాయి. ఒక్క మంచిపోలీసు ఒక్కసారయినా క్రూరమైన యజమానిమీద తుపాకీ గురిపెట్టిన వార్త అయినా విన్నామా ? ప్రజానాయకుల్ని అరెస్టుచేసి, విపరీతంగా హింసించి చంపి 'ఎన్‌కౌంటర్'లో చనిపోయినట్లు చెప్పింది ఎవరు ? పాలకులు పోలీసుల్లో నీతిని కూడా చంపేశారు. లంచం వాళ్లకు జీతం. కరివేపాకు అమ్ముకునే పల్లె స్త్రీ మొదలు అరక్ దొరగారివరకు అందరిదగ్గరా లంచాన్ని పోగుచేసు

కోవటమే. ఈ స్థితిలోవున్న పోలీసుల్లో చైతన్యం వస్తుందనుకోవటం చెరబండరాజు మంచితనానికి వుదాహరణ కావచ్చు కానీ సమాజ అనుభవానికి, విప్లవ సిద్ధాంతానికీ వ్యతిరేకమే. ఇది ఎంతో ప్రసిద్ధమైన పాట కాబట్టి ఇంత చెప్పవలసి వచ్చింది. ద్వితీయ ముద్రణలో ఈ పాటను 'ముట్టడి' నుంచి తొలగించటం న్యాయం. లేకుంటే విప్లవ కవిత్వ పాఠకులే దీన్ని నిషేధిస్తారు.

రెండవది "కామ్రేడ్". విప్లవకారులకి, విప్లవవాదులకి వుండే గతితార్కిక సంబంధాన్ని చెరబండరాజు ఈ గేయంలో నిర్దయగా తెంచివేశాడు. కవుల, విప్లవకారుల రంగాలు పూర్తిగా భిన్నమైనవి అనుకోవడం అశాస్త్రీయం. ఇంతకీ పాణిగ్రాహి లాంటి కత్తి-కలం పట్టుకున్నవారికి చెరబండరాజు ఏ సలహా ఇస్తారు? కలాన్నిపారేసి కత్తినే వుంచుకోమంటారా? "నీ రంగం రణరంగం, నారంగం భావతరంగం" ప్రాస బాగానే వుందిగానీ విప్లవకారులు చేసేది భావరణరంగం. విప్లవానికి ప్రధాన ఆయుధం భావమే. అంటే సిద్ధాంతమే. 'శక్తినీది యుక్తినాది' ఇది ఎంత అబద్ధమో అంత తెలివితక్కువ తనంకూడ. పోరాటాల సంగతి అలావుంచి విప్లవస్థితి వచ్చినప్పుడు కూడా 'కత్తినీది, కలంనాది' అనే అంటారా? ఈ బంధం వుద్యమ చైతన్యాన్ని, వ్యక్తి విప్లవ సంస్కారాన్నిబట్టి వుంటుంది. నికరంగానూ, నిశ్చయంగానూ చెప్పటం సరైంది కాదు 'నిశ్శేషంగా శత్రువు నిర్మూలన మనధ్యేయం'- దీన్నికూడా ఎడంగా వుండి కలంతోనే సాగిస్తారా? 'పొడిచి, పొగిడి' మాటల లయ బాగుందికానీ ప్రభుత్వంవారు చెరబండరాజును జైల్లోపెట్టటంకూడా పొగడ్తే అనుకోవాలా? ఇలా అంటూనే'కామ్రేడ్' అని సంబోధిస్తున్నారే- ఇందులో కామ్రేడిజం ఎక్కడవుంది? ఈ గేయంలో ప్రతి అక్షరం విప్లవ అవగాహనకు వ్యతిరేకంగానే వుంది. ఇందులోని భావం సార్వకాలికం కాదు. కవితాపరంగాకూడా యిది ప్రాసక్రీడ. అక్షర నృత్యం. ఇలాంటి పిరికి గేయాలు చెరబండరాజు రాయటం సమంజసంకాదు. 'నేడైనా రేపైనా', 'సకలార్థసాధకులెవరు', 'సాధన' అనే గేయాలు కవితాపరంగా నీరసంగా వున్నాయి. వీటిలో 'చెరబండరాజుముద్ర' లేదు.

"విషాదస్వరాల అలికిడిలేదు" నిజమేకానీ కవిత మొత్తంలో వాక మృదుత్వం వుంది. కన్నీళ్లు, హృదయం, ప్రేమ, వాత్సల్యంలాంటి మెత్తని పూతవొకటి చెరబండరాజు కవిత్వానికి సహజ స్వభావం అయిపోయింది. ఇదే యితరులకు వేదనగా కనిపిస్తుంది. వర్గశత్రువును వర్ణించేటప్పుడుకూడా ఈ'వెన్న'లక్షణం పోలేదు. "నిత్య చైతన్యమూర్తులు, అర్తులు"— అర్తులెందుకు? "నలగని కాంతి దీపాలు వాళ్లు." కాంతి దీపాలు నలగటం ఏమిటి? విప్లవ కవిత్వంలో కాస్త కాఠిన్యం, వాస్తవాన్ని విప్పి

చెప్పే ఆవేశం, దోపిడిలోని భయంకరతను స్ఫురింపచేసే ఖడ్గలక్షణం చాలాఅవసరం. పాఠకుని హృదయంలో ఏదో జివ్వుమనేట్టు చేయటం. ఆలోచనలమీద మంచుతెరల్ని దించటం కవిత్వంగా బాగానే వుంటుందికానీ విప్లవ భావానికి వుండవలసిన ఝంయూ రూపం పోతుంది. భావప్రతిపాదనతో, వర్గ శత్రువు స్వభావాన్ని రచ్చకెక్కించ టంలో, అనుభవంలో అగ్ని రగిలించటంలో చెరబండరాజు అగ్నిపుత్రుడు కావాలి.

---

(ముట్టడి - చెరబండరాజు. వెల: 2 రూపాయలు. ప్రతులకు: రచ యిత 2-2/359 అంబర్ పేట. హైదరాబాదు 500013.)

---

★ యుద్ధం కార్మికలోకంలో, బాగా వెనుకబడిన తరగతులలోకూడా, రాజకీయ సమస్యల, వ్యవహారాల యెడల ఆసక్తిని కలిగిస్తూంది. యుద్ధం మునుపెన్నటి కన్నా కూడా స్పష్టంగా, తేటతెల్లంగా నిరంకుశ వ్యవస్థయొక్క పూర్తి కుళ్లును, మనను పరిపాలిస్తున్న పోలీసుల, మనను ఏలుతున్న పాలకముఠా యొక్క యావత్తు అపరా ధాన్నీ చాటుతూంది. స్వదేశంలో మన ప్రజలు ఆకలి లేములతో అలమటించి పోతున్నారు— అయినా, వేలమైళ్ల దూరంలో విదేశీ జాతులు నివసించే పరాయి ప్రాంతాల కోసం సాగించుతూన్న మతిమాలిన వినాశకర యుద్ధంలోనికి వారు యీడ్చ బడ్డారు. మన ప్రజలు రాజకీయ బానిసత్వపు గుదిబండతో సతమతమవుతున్నారు— అయినా వారు యితర జాతుల ప్రజలను బానిసలనుచేసేందుకు సాగే యుద్ధంలోనికి యీడ్చబడ్డారు. మన ప్రజలు స్వదేశంలో రాజకీయవ్యవస్థ మారాలని కోరుతున్నారు— అయినా ప్రపంచపు మరోమూల పేల్చుతున్న తుపాకీ మోతలద్వారా వారి దృష్టిని మళ్ళించే ప్రయత్నం జరుగుతూంది.

★ వర్గచైతన్యంగల సంఘటిత కార్మిక వర్గం మాత్రమే ప్రజలకు బూటకపు స్వేచ్ఛను గాక నిజమైన స్వేచ్ఛను సాధించిపెట్ట గలుగుతుంది. ప్రజలను మోసం చేసేందుకు, వారి హక్కులను హరించేందుకు, బూర్జువా వర్గం చేతులలో వారిని కేవలం పనిముట్లుగా తయారుచేసేందుకు జరిగే ప్రతి ప్రయత్నాన్ని, వర్గచైతన్యం గల సంఘటిత కార్మికవర్గం మాత్రమే వమ్ముచేయగలుగుతుంది.

— లెనిన్

సాహిత్య లేఖలు :

## "జాతి సమస్య - మార్క్సిస్టు దృక్పథం" — ఒక విమర్శ

జాతి సమస్యను మార్క్సిస్టు దృక్పథంనుండి పరిశీలించటం భారత దేశానికి ఒక విద్యావిషయకమైన అంశంకాదు. అదొక ఆచరణ ప్రాధాన్యతగల అవసరం. భారత దేశం బహుజాతులుగల దేశం. తూర్పు బెంగాల్ సమస్యకూడా తోడవటంతో యీ సమస్య ప్రాధాన్యత యింకా పెరిగింది. అందువల్ల శ్రీ కొడవటిగంటి కుటుంబరావు ఈ సమస్యపైన ఒక చిన్న సమీక్షా వ్యాసం (అక్టోబరు–సృజన) రాయటం ఆహ్వానించ దగిందే. 1912-13 సంధికాలంలో స్టాలిన్ చేసిన "మార్క్సిజం-జాతిసమస్య" అన్న ఉత్తమ రచనను శ్రీ కుటుంబరావు సమర్థవంతంగా సమీక్షించారు. జాతి సమస్యను అర్థంచేసుకొనటానికి ఈ సమీక్ష తోడ్పడుతుంది.

అయితే, అందులో వున్న వొక కీలకమైన లోపాన్ని ఎత్తిచూపటం అవసర మనుకొంటాను 1913 తర్వాత మొదటి ప్రపంచయుద్ధం జరిగింది. సోవియట్ యూనియన్ ఆవిర్భవించింది. శ్రామికవర్గ విప్లవాలు జయప్రదమయ్యే సామ్రాజ్యవాద యుగపు మార్క్సిజంఅయిన లెనినిజం ఆవిర్భవించింది. ఆ దశలో లెనిన్ వారసుడుగా స్టాలిన్ జాతిసమస్యను నూతన పరిస్థితులకు అన్వయించి అభివృద్ధిచేశారు. "లెనినిజం-దాని పునాదులు" అనే మహత్తర గ్రంథంలో ఒక భాగంగా "జాతి సమస్య"ను అయన విపులీకరించారు. "లెనినిజం-దాని పునాదులు"లో ఈ సమస్యపైన చర్చ ప్రారంభంలోనే "గత రెండు దశాబ్దాలకాలంలో జాతి సమస్య అనేకమైన, చాలా ముఖ్యమైన మార్పులు పొందింది"అని స్టాలిన్ చెప్పారు. లెనినిజం దశలో "జాతి సమస్య ఆ విధంగా ఒక ప్రత్యేకమైన, ప్రభుత్వంయొక్క ఆంతరంగిక సమస్యనుండి సాధారణమైన, అంత ర్జాతీయ సమస్యగా, సామ్రాజ్యవాద పెత్తనం నుండి పరాధీన దేశాల్లోని, వలసల్లోని పీడితప్రజలను విముక్తి చేసే ప్రపంచసమస్యగా మార్పుచెందింది"అని స్టాలిన్ చెప్పారు. "గతంలో జాతి సమస్య సంస్కరణవాద దృక్పథంనుండి, పెట్టుబడియొక్క అధికా రంతోగానీ, సామ్రాజ్యవాదాన్ని కూలదోయటంతోగానీ, శ్రామికవర్గంతోగానీ నిమిత్తం లేని స్వతంత్రమైన సమస్యగా చూడబడింది"అని స్టాలిన్ విమర్శించారు. "శ్రామిక వర్గ విప్లవం అనే సాధారణ సమస్యలోనూ, శ్రామికవర్గ నియంతృత్వ సమస్యలోనూ జాతిసమస్య ఒక భాగం"అని ఆయన స్పష్టం చేశారు.

జాతులకు స్వయం నిర్ణయాధికారహక్కును కమ్యూనిస్టుపార్టీ గుర్తించుతుందని 1913 లోనే స్టాలిన్ స్పష్టంగా చెప్పారు. స్వయం నిర్ణయాధికారమంటే, విడిపోయేహక్కు. స్వతంత్ర రాజ్యాన్ని నెలకొల్పుకొనే హక్కుగూడా ప్రతిజాతీ కలిగివుంటుందని ఆయన వివరించారు. పీడితజాతులు స్వాతంత్ర్యంకొరకు చేసే పోరాటాలను కమ్యూనిస్టు పార్టీ బలపరుస్తుందని వివరించారు. "లెనినిజం-దాని పునాదులు" అన్న రచనలోగూడా యీ విషయాన్ని స్పష్టంగా చెప్పారు. అయితే 1913లో "మార్క్సిజం-జాతిసమస్య" రచన చేసేనాటికీ ఆ తర్వాత రెండు దశాబ్దాల అనంతరం "లెనినిజం-దాని పునాదులు"రచించేనాటికీ ఆ సమస్యలో వచ్చిన మార్పేమిటంటే, "జాతి సమస్య ఒక ప్రత్యేకమైన, ప్రభుత్వంయొక్క ఆంతరంగిక సమస్యనుండి సాధారణమైన, అంతర్జాతీయ సమస్యగా, సామ్రాజ్యవాద పెత్తనం నుండి పరాధీన దేశాల్లోని పీడితప్రజలను విముక్తి చేసే ప్రపంచ సమస్య"గానూ "శ్రామికవర్గ విప్లవం అనే సాధారణ సమస్యలో ఒకభాగం"గానూ రూపొందింది. ఈ మార్పు చాలా కీలకమైనది. జాతుల స్వయం నిర్ణయాధికార సూత్రాన్ని అర్థంచేసుకొనేటప్పుడూ, దాన్ని ఒక నిర్దిష్ట పరిస్థితికి అన్వయింపజేసేటప్పుడూ, సమస్యలో వచ్చిన ఈమార్పును గమనించకపోతే విషయమంతా తల్లకిందులయ్యే ప్రమాదముంది.

ఎందుచేతనంటే, జాతుల స్వయం నిర్ణయాధికార హక్కుకు సంబంధించిన సాధారణ సూత్రాన్ని కమ్యూనిస్టుపార్టీ గుర్తించినా, విడిపోయేటందుకు జాతులుచేసే ప్రతి పోరాటాన్నీ కమ్యూనిస్టుపార్టీ బలపరచనవసరం లేదు ఈ విషయమై 1913 లో స్టాలినే ఇలా చెప్పారు: "రష్యన్ పోలెండు విడిపోవటానికి 19వ శతాబ్దం మధ్య భాగంలో మార్క్సు అనుకూలించారు: ఆయన అలాచేయటం సరైందే: ఎందుకంటే, దిగువ స్థాయి సంస్కృతిచేత నాశనం చేయబడుతున్న ఉన్నత సంస్కృతిని విముక్తి చేయటం అప్పటి సమస్య...."

"పందొమ్మిదవ శతాబ్దం చివరి భాగంలో పోలెండు మార్క్సిస్టులు పోలెండు విడిపోవటానికి తాము వ్యతిరేకమని ప్రకటించి వున్నారు. వారు అలా చేయటంగూడా సరైందే: ఎందుకంటే, ఆ మధ్యలో గడచిన యాభై సంవత్సరాల కాలంలో రష్యానూ పోలెండునూ ఆర్థికంగా, సాంస్కృతికంగా మరింత సన్నిహితంచేసే లోతైనమార్పులు సంభవించాయి. అంతేగాక, ఆమధ్యకాలంలో విడిపోవటం అనే సమస్య ఆచరణకు సంబంధించిన సమస్య నుండి బహుశా విదేశాల్లోని మేధావులను తప్ప మరెవ్వరినీ ఉత్తేజ పరచనటువంటి విద్యావిషయకమైన సమస్యగా మారిపోయింది." ("మార్క్సిజం-జాతి సమస్య", స్టాలిన్ వర్క్సు. పేజీ 324)

మనం గమనించవలసిన విషయమేమంటే, ఏ జాతియొక్క విడిపోయేపోరాటాన్నైనా బలపరచటంలో గానీ, లేదా వ్యతిరేకించటంలో గానీ జాతి సమస్యను 1913 నాటికి సామ్రాజ్యవాదం నుండి విముక్తి చెందే సమస్యగాగానీ, శ్రామికవర్గ విప్లవంలో ఒక భాగంగాగానీ చూడటం జరగలేదు. కానీ 'లెనినిజం - దాని పునాదులు' ధరించే నాటికి ఆ సమస్యను దిగువ విధంగా స్టాలిన్ వివరించారు:

"ప్రతి జాతీయోద్యమాన్నీ ప్రతిచోటా, ఎల్లప్పుడూ, ప్రతి నిర్దిష్టమైన ప్రత్యేక సందర్భంలోనూ శ్రామికవర్గం బలపరచాలని దాని అర్థంకాదు. సామ్రాజ్యవాదాన్ని పటిష్టవంతంచేసి దాన్ని కాపాడే జాతీయోద్యమాలనుగాక, సామ్రాజ్యవాదాన్ని బలహీన పరచి, దాన్ని కూలదోయటానికి దోహదంచేసే జాతీయోద్యమాలను బలపరచాలని దాని అర్థం. కొన్ని పీడిత దేశాల్లోని జాతీయోద్యమాలు శ్రామికవర్గ ఉద్యమాభివృద్ధి ప్రయోజనాలతో సంఘర్షణపడే సందర్భాలువస్తాయి. అటువంటి సందర్భాల్లో బలపరచటం అనే సమస్య అసలు ఉత్పన్నమేకాదు. జాతుల హక్కుల సమస్య వేరుచేయబడిన స్వయం సంపూర్ణమైన సమస్య కాదు; శ్రామికవర్గ విప్లవం అనే సాధారణ సమస్యలో అదొక భాగం; ఇది మొత్తం సమస్యకు లోబడి వుంటుంది; మొత్తం సమస్యయొక్క దృక్పథం నుండి దీన్ని పరిశీలించాలి. గత శతాబ్దం 40 వ దశాబ్దంలో పోలెండు, హంగెరి జాతీయోద్యమాలను మార్క్స్ బలపరిచారు; జెక్కుల, దక్షిణ స్లావుల జాతీయోద్యమాన్ని ఆయన వ్యతిరేకించారు. ఎందుచేత? ఎందుకంటే, ఆనాడు జెక్కులు, దక్షిణ స్లావులు "అభివృద్ధి నిరోధక ప్రజలు", యూరపులో "రష్యన్ కేంద్రాలు" నిరంకుశాధికారానికి కేంద్రాలు; కాగా, పోలిష్ ప్రజలు, హంగేరియన్లు, "విప్లవ ప్రజలు". నిరంకుశాధికారానికి వ్యతిరేకంగా పోరాడుతున్నవారు. జెక్కుల, దక్షిణ స్లావుల జాతీయోద్యమాన్ని అప్పుడు బలపరచటమంటే, యూరపులో అత్యంత ప్రమాదకర శత్రువైన జారిజాన్ని పరోక్షంగా బలపరచటంతో సమానం."

ఇదే సమస్యపై లెనిన్ చెప్పిన విషయాన్ని స్టాలిన్ ఇలా ఉదహరించారు: "స్వయం నిర్ణయాధికారంతో సహా ప్రజాస్వామ్యానికి సంబంధించిన వివిధ డిమాండ్లు అఖండమైనవి (తిరుగులేనివి) కావు; సాధారణ ప్రజాస్వామిక (ఇప్పుడు సాధారణ సోషలిస్టు) ప్రపంచ ఉద్యమంలో అవి చిన్నభాగం. నిర్దిష్టమైన ప్రత్యేక సందర్భాల్లో మొత్తంతో ఒక విభాగం నిరోధించ వచ్చును. అలా జరిగినట్లయితే, దాన్ని నిరాకరించవలసి వుంటుంది" (లెనిన్ వర్క్స్, వాల్యూం XIX పేజీలు 257-58)

స్టాలిన్ ఇంకా యిలా చెప్పారు: "పీడితప్రజల జాతీయోద్యమాన్ని లాంఛన ప్రాయమైన ప్రజాస్వామిక దృక్పథం నుండిగాక, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటా

నికి సంబంధించిన సాధారణమైన లాభనష్టాల పట్టిక సూచించే వాస్తవఫలితాల దృక్పథం నుండి. అంటే, 'విడిగాగాక, ప్రపంచస్థాయిలో' మదింపుచెయ్యాలని లెనిన్ సరిగ్గానే చెప్పారు. (లెనిన్ వర్క్సు, వాల్యూం XIX, పేజీ 257)

లెనిన్, స్టాలిను చెప్పిన పై విషయాలనుబట్టి తేలేదేమిటి? జాతుల స్వయంనిర్ణయాధికార హక్కును కమ్యూనిస్టు పార్టీ గుర్తిస్తుంది. అయితే ప్రతి నిర్దిష్టమైన ప్రత్యేక జాతి చేసే పోరాటాన్ని కమ్యూనిస్టు పార్టీ బలపరచదు. అది సామ్రాజ్యవాదాన్ని బలహీనపరచి, దాన్ని కూలదోయటానికి దోహదంచేసేదైతేనే బలపరుస్తుంది. లేకపోతే వ్యతిరేకిస్తుంది. ఇక్కడ రెండర్థాలకుగానీ, పెడార్థాలకుగానీ, సందిగ్ధతకు గానీ తావులేదు. మార్క్సిస్టు మహామహోపాధ్యాయులు లెనిన్, స్టాలిను కుండబద్దలు కొట్టినట్లు చెప్పిన సూత్రం యిది.

కానీ, శ్రీ కుటుంబరావుగారి వ్యాసంలో ఈ కీలకమైన అంశం లోపించింది. ఇది లోపించితే విషయమంతా తల్లకిందులయ్యే ప్రమాదముందని నేను మొదట్లోనేచెప్పాను. కుటుంబరావుగారి విషయంలోగూడా సరిగ్గా అదేజరిగింది. "బలవంతమైనజాతి అడుగునవున్న జాతిని ఎక్కరానివ్వదు. (తూర్పుపాకిస్తాన్‌వారి ఆశయాలను పశ్చిమపాకిస్తాన్ అణచినట్టు)" అని ఆయన ఒకచోట ప్రస్తావించారు. మరొకపేరాలో "ఇంత వత్తిడి వచ్చాక పీడితజాతికి చెందిన బూర్జువాలు తమజాతికి చెందినవారిని "మాతృదేశం" వినాదంతో రెచ్చగొడతారు. తమ సమస్య జాతికంతకూ చెందినదంటారు. ప్రజలు నిర్లిప్తంగా వుండక చైతన్యం ప్రదర్శిస్తారు. (బంగ్లాదేశ్ జాతీయోద్యమం అలా ప్రారంభమవుతుంది.)" అని కుటుంబరావు పేర్కొన్నారు. అణగదొక్కుతున్న జాతికి వ్యతిరేకంగా అణగదొక్కబడే జాతి చైతన్యం ప్రదర్శించటానికి ఉదాహరణగా "బంగ్లాదేశ్ జాతీయోద్యమాన్ని" కుటుంబరావు పేర్కొన్నారు. తూర్పుపాకిస్తాన్ ప్రజల ఆశయాలను పశ్చిమ పాకిస్తాన్ పరిపాలకులు అణచినమాట నిజమే. అయితే అక్కడ ఇటీవల జరిగినదాన్ని ప్రజలు చైతన్యం ప్రదర్శించిన జాతీయోద్యమంగా ఉదహరించవచ్చునా, అన్నది ప్రశ్న.

అది స్వయం నిర్ణయాధికార హక్కుకొరకు ప్రజలు చైతన్యవంతంగా చేసిన జాతీయోద్యమమే అయితే భారత అభివృద్ధి నిరోధక ప్రభుత్వ సైన్యాలు తూర్పు పాకిస్తాన్‌మీద సైనికదాడిచేసి దాన్ని ఎందుకు ఆక్రమించుకొన్నాయి? తొంభైవేలకుపైగా పాకిస్తాన్ సైనికులూ, ఇతర పౌరులూ బంగ్లాదేశ్‌లోనే వుంచబడక, భారతదేశానికి ఎందుకు తరలించబడ్డారు? ఈ దురాక్రమణ యుద్ధంలో భారతదేశానికి ఒక అగ్రరాజ్యమైన సోషల్‌సామ్రాజ్యవాద సోవియట్ యూనియన్ నైతిక, భౌతిక సహాయాలు ఎం

దుకు అందజేసింది? కొత్తగా ఏర్పడిన ముజిబుర్ రెహమాన్ కీలుబొమ్మ ప్రభుత్వం మరొక అగ్రరాజ్యమైన అమెరికన్ సామ్రాజ్యవాదం నుండి ఆర్థికసహాయ పరంపరలు ఎందుకు స్వీకరిస్తున్నది? భారత సైన్యాలు యింకా ఆ భూభాగంపైనే వున్నట్లు నేషనల్ అవామీపార్టీ నాయకుడు మౌలానా భషానీ ప్రకటించటం మనం పత్రికల్లో చదువుతున్నాంగదా? లోగడ "లండన్‌టైమ్స్" పత్రికకూడా ఈ వాస్తవాన్ని వెల్లడిచేసిందిగదా? ఈ వార్తను ప్రచురించిందన్న అక్కసుతోనేగదా, మౌలానా భషానీపత్రిక "హక్‌కథ"ను ముజీబ్ ప్రభుత్వం యిటీవల నిషేధించింది? ఈ వాస్తవాలన్ని ప్రజలు చైతన్యం ప్రదర్శించినదానికి ఉదాహరణగా కుటుంబరావు పేర్కొన్న జాతీయోద్యమం అనబడే దాని బూటకత్వాన్ని బట్టబయలు చేయటంలేదా?

కుటుంబరావుగారు జాతి సమస్యను ఒకేప్రభుత్వ చట్రంలోవున్న జాతులమధ్య. (అణగదొక్కే జాతికీ అణగదొక్కబడే జాతికిమధ్య)గల ప్రత్యేకమైన, అంతరంగిక సమస్యగా చూస్తున్నారే తప్ప "లెనినిజం-దానిపునాదులు"లో స్టాలిన్ చెప్పినట్లు సాధారణమైన అంతర్జాతీయ సమస్యగా, సామ్రాజ్యవాద పెత్తనం నుండి పరాధీనదేశాల్లోని, వలసల్లోని పీడితప్రజలను విముక్తి చేసే సమస్యగా, శ్రామికవర్గ విప్లవంలో ఒకభాగంగా చూడటం లేదు. తూర్పు బెంగాల్లోని జాతి సమస్యను తూర్పు పాకిస్తాన్‌ను పశ్చిమ పాకిస్తాన్ అణచుతున్న సమస్యగామాత్రమే కుటుంబరావుగారు చూస్తున్నారు. మొత్తం పాకిస్తాన్‌యొక్క అర్థవలస, అర్థఫ్యూడల్ స్వభావాన్నీ, అక్కడి సామ్రాజ్యవాదుల దోపిడీ పెత్తనాలనూ సామ్రాజ్యవాదుల, సోషల్‌సామ్రాజ్యవాదుల చైనావ్యతిరేక ప్రపంచ వ్యూహపు గొలుసులో తూర్పు పాకిస్తాన్‌ను ఒకలింకుగా తయారుచేసుకొనటానికి జరిగే పన్నాగాలనూ, అక్కడ శ్రామికవర్గం నాయకత్వాన జయప్రదంకావలసిన జనతాప్రజాతంత్ర విప్లవాన్నీ- వీటన్నింటినీ దృష్టిలోపెట్టుకొని ఆ సమస్యను పరిశీలించకపోతే, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట లాభనష్టాలపట్టిక సూచించే వాస్తవఫలితాల దృక్పథం నుండి చూడకపోతే, శ్రామికవర్గంలో ఒకభాగంగా ఎంచకపోతే తల్లకిందులుగా ఆలోచించే ప్రమాదముంది. అటువంటి తల్లకిందుల పరిశీలన తూర్పుబెంగాల్ ప్రజల విప్లవానికేగాక భారత విప్లవానికిగూడా నష్టకరం. అందువల్ల జాతిసమస్యను మార్క్సిస్టు-లెనినిస్టు దృక్పథం నుండి అర్థంచేసుకొనటానికి స్టాలిన్ రచించిన "మార్క్సిజం-జాతి సమస్య"తో బాటు "లెనినిజం-దాని పునాదులు"లో వున్న "జాతిసమస్య"ను గూడా అధ్యయనం చేయటం అవసరం. ఆ విధంగా మన అవగాహనలో లోపాలుంటే సరిదిద్దుకొనటం ఉపయోగం.

— 'చంద్రం'

## అధివాస్తవికతా? విప్లవ వాస్తవికతా?

"సృజన కవితలు – అధివాస్తవికత" అనే సాహిత్యలేఖ (జనవరి '73 సృజన) మొదటిపేరాలో సృజనను 'రాబోయే యుగసాహిత్యానికి వైతాళికుడుగా' 'ఒకపాఠకుడు' ఒప్పుతున్నాడు. ఆఖరున "పాడిందేపాటగా. అదేకత్తిని పదిసార్లు గాలిలో మాత్రమే త్రిప్పటంగా విప్లవ కవిత్వాన్ని దిగజార్చడం విరమించి ప్రజావిప్లవోద్యమ దీర్ఘయాత్రా సీరియస్‌నెస్‌కు అంకితమవాలని" సృజనకు ఉచితసలహా అందించాడు. ఆ పాఠకుడు "రాబోయే యుగసాహిత్యానికి" అంటే సరిగా అర్థంచెప్పాల్సి ఉంది. రాబోయే దిగజార్చుడు విప్లవయుగ సాహిత్యానికి వైతాళికుడిగానా? లేక విప్లవయుగ సాహిత్యానికి వైతాళికుడిగానా? ఒకవేళ విప్లవయుగ సాహిత్యానికే వైతాళికుడిగా అనుకుందాం, ఇప్పుడే కవిత్వాన్ని దిగజార్చుతున్నది విప్లవయుగ సాహిత్యానికి వైతాళికుడిగా ఎలా చిత్రిస్తాం. "ఆ కృషి ఏమీ సృజన కవితల్లో కన్పించదు– జీవితాన్ని గురించి లోతైన చర్చగాని వివిధరకాల ప్రజల అనుభవాల సహానుభూతిగాని సమాజవ్యవస్థలోని చెదురు వివిధరూపాల పరిశీలనగాని, మామూలుప్రజలు ఏ వర్గంవారినైనా పరిశీలనలో పడవేసే కదల్చే వచ్చజెప్పే విదానంగాని సృజనకవితలలో కవిపించటంలేదు"లను పరిశీలించండి. వారి విమర్శలో అసలు సృజనలో వస్తున్న పాటలు, గేయాలను పరిశీలించండి. ప్రతి పంక్తిలోనూ రక్తాన్ని చెమటగా మార్చి అధికారవర్గానికి అమ్ముకుంటున్న వర్గానికి కర్తవ్యాల్ని నిర్దేశిస్తున్నాయి. విప్లవ కవిత్వం ఏవర్గంవారినైనా పరిశీలనలో పడవేసే కవిత్వంమటుకుకాదు. విప్లవ కవిత్వం లక్షణం అసంఖ్యాక పీడిత ప్రజానీకానికి విప్లవ మార్గదర్శకంగా ఉండాలి.

"కేవలం రాజకీయం. అందునా ఒకే సింపుల్ విధానం. (కత్తి)శత్రువును హత్య చేయటం. కపి, బిడ్మాష్ యిదే యీ అత్యల్పమైన థీమ్ మాత్రమే పునః పునః ప్రవచించబడుతూ దాదాపు అదే రచయితల అవేభావాల్ని ప్రతిబింబించడంగా జరుగుతున్నది."

అవును. సమాజంలో ప్రతీదీ రాజకీయమే. ఏది వ్రాసినా ఏదోఒక మోతాదులో ఒక రాజకీయ ప్రయోజనం కోసమే. ఇంకా సరిగ్గా చెప్పాలంటే ఒక వర్గ ప్రయోజనంకోరకు. వర్గకసినిపదాల్లో పెట్టడం అత్యల్పమైనదని ఏ మార్క్సిస్టూ అనడు. ఆఖరికి బూర్జువావర్గ ప్రతనిధి లేక ఇందిరాగాంధీయే వర్గకసిని రెచ్చగొట్టవద్దని బహిరంగ

సభల్లో ఉపన్యాసాలు చేస్తుంది. అంటే వర్గకసి అత్యున్నతమైనస్థాయికి తీసుకపోబడి నపుడే బూర్జువావర్గసమాధి సాధ్యం.

"పోనీ అదయినా నిజంగా దేశపరిస్థితుల్లో వాస్తవానికి దగ్గరగా వున్నదాఅంటే లేదు. ఎక్కడో ఎపుడోజరిగే ఒకటి. అరా సంఘటనలే దేశంలోవున్న వాతావరణంగా ప్రతిబింబించే కవిత్వమవుతున్నది. అది సరైన విప్లవ కవితగా ఎంచ వీలులేదు. మరి అది మహోత్తమ, విప్లవ కవిత్వంగా తీసుకురాబడుతున్నది."

దేశంలో ఏ మారుమూల ఏదిజరిగినా మొత్తం దేశంమీద దాని ప్రభావం ఉంటుంది. సాయుధ సంఘర్షణ ఏరూపంలోఉన్నా మొత్తం భారతదేశంపై దాని ప్రభావం ఉండితీరుతుంది. ఎందుకంటే ఎంతచిన్న నిప్పురవ్వైనా అది గొప్ప దావాగ్నిని సృష్టించగలదు. కాబట్టి ఎంత చిన్న సంఘటనైనా అది విప్లవాన్ని తీవ్రతరం చేసేదైతే, దాన్నిగురించి వ్రాసేకవిత తప్పనిసరిగా విప్లవకవిత, అది మహత్తరకవిత.

నాతలను తీసినా, ప్రజలు....

నా చేయి నువు నరికినా ప్రజలు ... చేస్తారు

వగైరా, ఇది మంచి ఆశయమే కాని వాస్తవానికి చాలాదూరంగా ఉంది" ఇది వాస్తవానికి ఎలా దూరంగావుందో కొంచెం వివరించి ఉండవలసింది ఈపాఠకుడు. బహుశా వీరి దృష్టిలో విప్లవకవిత అతివాస్తవికతలాగా ఉన్నట్లుంది.

"కీచకవధ–కీచకుణ్ని చంపటంవలెనే భూస్వాములను వ్యక్తులుగా చంపేయాలనటం వరకైతే అది గొప్ప విప్లవదృష్టేకాదు. గొప్ప కవిత్వం అంతకన్నాకాదు." 'భౌతిక హింస, విప్లవ ప్రతిఘాతుక శత్రువుతోవున్న వైరుధ్యాన్ని పరిష్కరించడానికే వర్తిస్తుంది'అంటాడు మావో. ("Physical voilence only app'ies to Solve the contradictions with the Counter-revolutionary enemy") మరి యిదికూడా విప్లవదృష్టి కాదేమో ? 'కీచకుడు' వ్యక్తికానట్టే భూస్వామికూడా వ్యక్తి కాదు. కీచకుడు దుష్టవ్యవస్థకు ప్రతీక. భూస్వామి వర్గశత్రువు. వర్గశత్రు నిర్మూలనను వ్యక్తినిర్మూలనగా చిత్రించడం విప్లవ నిర్వచనాన్ని కావాలని వక్రీకరించడమే.

"ఇంతమంది విప్లవ రచయితలు విద్యార్థులు వగైరాలువుంటే "మావోమతమే తమ మతమని, శ్రామికకులమే తమ కులమని, బొగ్గుబటలలో పనిచేస్తున్నానని"వగైరా నిజంగా భావనజేసే తత్వం శతాంశంకూడా వాస్తవికంగాలేదు. బడాయిలు చెప్పుకోవటం, లేనిపోని ఆచరణలోలేని కోతలు కోయటమే ప్రజాకవిత్వమని నేననుకోను"అని ముద్రవేయంగానే సరికాదు. అవి అన్నీ కోతలేనని రుజువు చేయవలసిన బాధ్యత కూడా విమర్శకుడిపై వున్నది. వారు రుజువు చేయడానికి సిద్ధమేనా ?

ప్రతి శత్రువునూ 'బద్మాష్'అని తిట్టక కామ్రేడ్ అనీ, ప్రతి విప్లవ ద్రోహినీ మార్క్సిస్టు అనీ పిలిచే రోజులకు కాలం చెల్లిపోయిందని పాఠకుడు గుర్తించలేదనుకుంటాను. శత్రువునూ, విప్లవ ద్రోహినీ తిడితే పాఠకుడిగారికి యెందుకు మంచిగా లేదో అర్థంకావటంలేదు.

విప్లవ కవితలు అసంఖ్యాకపీడిత ప్రజలను ఎడ్యుకేట్ చేసేవిగానేఉండాలి. అంతే కాని వాటిని మధ్యతరగతి ప్రజలకు ఉద్దేశించడం సరైందికాదు. మధ్యతరగతిని ప్రత్యేకించి ఎడ్యుకేట్ చేయనవసరంలేదు. పీడిత ప్రజలు ఉవ్వెత్తున లేచినపుడు మిగిలేవి రెండేరెండు వర్గాలు, రివల్యూషనరీ, రియాక్షనరీ. మధ్యతరగతి మడికట్టుకుకూర్చోదు.

విప్లవ సాహిత్య బాధ్యతల్లో పాలుపంచుకొంటున్న సృజన, సృజన కవులూ అభివందనీయులు.

— ఇంకో పాఠకుడు.

## 'నాంది' నాటక ప్రదర్శన - ఆచరణ పాఠాలు

"ఈనాటి ప్రపంచంలో సంస్కృతి, సాహిత్యం, కళ అన్ని విశిష్టమైనవర్గాలకు రాజకీయాలకు వినియోగించబడుతున్నవి. కళ, కళకొరకు వర్గాతీతమైనకళ, రాజకీయాలకు సంబంధంలేని కళ అంటూ వాస్తవానికి లేదు. శ్రామికవర్గ సాహిత్యం, కళ మొత్తంగా శ్రామికవర్గ ఆశయంలో ఒకభాగం మాత్రమే. లెనిన్ చెప్పినట్లుగా అవి యావత్ విప్లవ రథచక్రాలకు సంబంధించిన వేరువేరు భాగాలు మాత్రమే" అన్నారు కామ్రేడ్ మావో.

ఇది నిరూపించారు 'నాంది' నాటకం రచయిత. సాహిత్యం, కళ, విశాలప్రజానీకంనకు సంబంధించినదవి, ముఖ్యంగా పీడితవర్గాలకు సంబంధించినది మాత్రమేనని. 24-3-1973కి మా గ్రామంలో "నాంది" నాటకం ప్రదర్శించటం విజయవంతంగా ముగిసింది. ఒక పెద్ద భూస్వామి, గ్రామాల్లోని ఇతర దోపిడిదార్లను ఏవిధంగా కల్పుకుంటాడో సిద్ధాంతపరంగా చూపించటం జరిగింది. అట్లే వివిధ పేదవర్గాలు ఎలా ఏకంకాగలుగుతారో రచయిత విప్లవ సిద్ధాంతంగా నిరూపించాడు. ప్రపంచంలోని పీడిత ప్రజలు పీడక పాలకవర్గముపై ఎలా తిరుగుబాటు చేస్తారో విపులంగా వుంది. వి.ర.సం. తరుపున యింతటి గొప్ప విప్లవాత్మక నాటకం ప్రచురించడం చాల సంతోషం. ముఖ్యంగా రచయిత గంగిరెడ్డిగార్కి విప్లవాభినందనలు.

"సాహిత్యం, కళ రాజకీయంగా ఎంత అభివృద్ధి అయినప్పటికి సరైన కళాత్మక రూపంలో అవి చూపకపోయినట్లయితే శక్తివంతంగా పనిచేయవు" అన్నారు మావో.

దీనివిషయంలో రచయితగారిలోపం కనిపిస్తూంది. ప్రజలే ప్రత్యక్షంగా దాడిలో పాల్గొన్నపుడు భూస్వామిపైనున్నకసితో అక్కడికక్కడే ఖతంచేస్తారు. భూస్వామి ప్రజలనుండి పూర్తిగా వేరుపడి వివిధ దోపిడీముఠాలతోకలసి, పీడిత ప్రజలను హత్య జేసినవాడిని ప్రజలు ఆ కసిని మర్చిపోయి, ప్రజాకోర్టులో విచారించడం చాల పెద్ద మితవాదంగాయున్నది. "మనశత్రువు కత్తినూరుతే మనం నూరాలి, మనల్ని హతం చేస్తే లేక చేయడానికి ప్రయత్నంచేస్తే మనం అదే ప్రయత్నం చేయాలి" అన్నాడు మావో. కాని దీనికి వ్యతిరేకంగా యున్నది. నాటకం కేవలం సంభాషణలుగానే యున్నది, వుత్తేజకరంగా లేకపోవడం చాల కళాహీనంగా యున్నది. రాజకీయంగా పరిష్కారమార్గం చూపిన, కళారూపకం సృష్టించలేకపోయారు రచయిత. ఈ లోపాల న్నిటిని సరిదిద్దుకొని రాబోయే నాటకాలు హేతువాదసిద్ధాంతపరంగా, ఉత్తేజకరంగా వుండేలా, కళాత్మకంగా రూపొందించాలి.

మా సంఘ వ్యతిరేకులు యిది నక్సలైట్ నాటకమని, పోలీసులు వచ్చి అరెస్టు చేస్తారని, చితకబాదుతారని ప్రచారాలుసాగించి నాటకం వేయకుండాచేయాలని ప్రయత్నంచేసారు. మొదట మా సభ్యులు కొంత భయపడినా, మరల ఈ ప్రచారం బూటకమని తెల్సుకున్నారు. ఇక్కడున్న మితవాదులు నాటకం వేయకుండా పెద్ద ఎత్తున ప్రచారం గావించి విఫలంపొందారు. ఎంత సంఘ వ్యతిరేక ప్రచారం గావించారో, అంత యెక్కువగా ప్రజలు వచ్చి నాటకం తిలకించారు. ఇంతవరకు ఏ కమ్యూనిస్టుల మీటింగ్‌కుకూడ యింతటి జనం రాలేదని ప్రజలు అనుకొంటున్నారు.

ప్రగతిశీల యువజన సంఘం,
వెలిదండి.

## 'ఆర్ట్‌లవర్స్' అక్కసు - చైతన్యధార పునఃప్రవాహం-

ఆరునెలలు ఆలోచించి వ్రాసిన నా సమీక్షా వ్యాసంపై హడావుడిగా అక్కసునంతా వెళ్ళగ్రక్కి జవాబుకోసం ఎదురుచూస్తున్న నా అజ్ఞాతమిత్రులకు ఆశాభంగం కలిగించినందుకు క్షంతవ్యుణ్ణి. అందుకు కారణాలు వివరించదలచుకోలేదు. నిజానికి ఆవేశంలో నన్ను అనరానిమాటలనడంకన్నా తాము వ్రాసింది తామే మరోసారి చదువుకున్నా లేక నన్నుగూర్చి ఏమాత్రమైనా తెలుసుకుందికి ప్రయత్నించినా నా వ్యాసంపై వచ్చిన ఆ ఒక్క విమర్శ పోస్టుచెయ్యాని ఉత్తరంగానే కాలగర్భంలో కలిసిపోయేది.

'ముసుగులు తొలిగితేకాని రంగులు బయటపడవు'. నిజమే ఆ మాట. కాని 'ఆర్ట్‌లవర్స్' ముసుగులో కవిత్వపు విలువలదృష్టితో నేను ఎత్తిచూపిన లోపాలు స్వీకరించి (62 పేజీ 1 వ పేరా, 5వ పేరా చివరిభాగం-సృజన జనవరి 1973) రాజకీయ విబేధాలవల్ల నాపై అపనిందలుమోపడం అవివేకానికి హాస్యానికీ పరాకాష్ఠ. ఆర్ట్‌లవర్స్ కాదని తేలిపోయింది. నా రంగు ఏనాడో బయటపడింది. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రతి గులకరాయి చెపుతుంది నాగురించి. వింతపేర్లు, పొడిఅక్షరాలేకాక పూర్తి పేరుతో సమీక్షలు, వ్యాసాలు, అభిప్రాయాలు ప్రకటిస్తోంది నేనా ? నావిమర్శకులా ?

దేశం సంగతి అటుంచి శ్రీకాకుళం పోరాటాలగూర్చి నాకు తెలియదనడం తల్లి పరువు మేనమామలకు తెలియదనడం. విప్లవ పోరాటాలు జరిగిన ప్రాంతాలు నేను పుట్టిపెరిగిన ప్రదేశమనీ స్థానిక ప్రజలతోను కార్యకర్తలతోను సన్నిహిత సంబంధాలున్నాయనీ, జయపురం కోరాపుట్టి ప్రాంతం పర్యటించి ఏడాదికూడా నిండలేదని నా మిత్రులకు తెలియకపోవడం కేవలం అజ్ఞానంవల్లనేకావచ్చు. ఇంతకీ 'సరిగ్గా అంచనా వేసి మనవాడే' అన్న ముద్ర వేయవలసింది కోనేటిస్నానానికి కొండుభట్లు అజ్ఞా' అన్నట్లు కొద్దిమంది కొత్త ఫ్రెండ్స్‌కాదు. విప్లవంపట్ల నా నిజాయితీనిగూర్చి చర్చించవలసింది విశాఖ-శ్రీకాకుళం యువజనోద్యమం ప్రారంభదశలో నాతోపాటు కృషిచేసిన స్థానిక సహచరులు, మిత్రులు, ప్రజలు. నల్లచీర కట్టుకున్నవాళ్ళంతా నా పెళ్లాలన్నట్లు పద్యం వ్రాసిన ప్రతివ్యక్తీ విప్లవకారుడు కాడు.

పనికిమాలిన నీతులు, మూఢనమ్మకాలు పెట్టుకొని భూమిని దేవతగామార్చింది నేనుకాదు. 'భూదేవి యోనిపుండులో రసి'ని వర్ణించిన విప్లవకవులు. భూమి పుట్టుపూర్వోత్తరాలగురించి నాలుగుగంటలు లెక్చరివ్వగలను వృత్తిరీత్యా రసాయనశాస్త్రజ్ఞుణ్ణి

కనుక. నేనన్నదల్లా దేవి అని సంబోధించేక యోనివర్ణన కవిత్వందృష్ట్యా రససంకరమూ రసాభాసమూనని. నా వ్యాసం ఉద్దేశ్యం నేటి విప్లవకవిత్వంలో కళాత్మక విలువలు లోపిస్తున్నాయనడంకాని రాజకీయాలు సాంఘిక తత్త్వశాస్త్రాలు చర్చించడంకాదని సామాన్య పాఠకులు అర్థంచేసుకోగలరు.

'మెదట్లోనే చుక్కెదురయింది' అర్ట్ అవర్స్ విషయంలోనే. నాలోకాదు. 'విశ్వశ్రేయఃకావ్యం'లాంటి "Serve The millions" వంటి పెద్దబాలశిక్ష సూత్రం ఆవరాగా తీసికొని కవితా గోదావరిని యీదబోవడం సాహసకృత్యం. కళలపై మార్క్సిస్టు దృక్పథాన్ని గూర్చి గత ఏభయిఏళ్లలో చెలరేగుతున్న రాద్ధాంత సిద్ధాంతాలనుగూర్చి నా మిత్రులు చూచాయగానైనా తెలుసుకోవడం అవసరమని అభిలషిస్తున్నాను. వయస్సును బట్టీ అనుభవాన్నిబట్టీ. మార్క్స్‌ను పదే పదే చదవడంకూడా అవసరం పరమానందయ్యశిష్యులుగా పరిణమించకుండా ఉండాలనుకుంటే. నా అభిప్రాయాలమాటఅటుంచి ఆధునిక యుగంలో ఎక్కడ ఏవిధమైన పోరాటం జరిగినా వివేకవంతులు అర్థంచేసుకుందికి ఏకైకసాధనం మార్క్స్ మనకందించిన అమూల్యమైన సాహిత్యం మాత్రమే. నేను ఉదహరించిన ఒక్క గ్రంథం (Marx Mss. of 1844) జర్మనీలో చదువుకునే రోజుల్లో అముద్రితం కనుక స్వంతమాటల్లో ఏమన్నదీ తెలియనందుకు నేను విచారిస్తూ ఉంటే మార్క్స్ రాతలు మాకనవసరమని భావించి నామీద కారాలూ మిరియాలూ నూరుతూ కాలం వృథా చేయవద్దని అజ్ఞాత మిత్రులకిదే ఆఖరి విజ్ఞప్తి.

— ఎస్.వి.ఎస్. రావు.

# ప్రస్తుతం సృజన దగ్గర అమ్మకానికి సిద్ధంగావున్న పుస్తకాలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | శ్రీకాకుళ సత్యం | పాటలు | వెంపటాపు సత్యం | 1-00 |
| 2. | వి.ర.సం.లో మార్క్సిస్టు వ్యతిరేక ధోరణులను ప్రతిఘటించండి | | విప్లవ రచయితలు | 1-50 |
| 3. | జనం | కథలు | న్యూవేవ్ ప్రచురణ | 1-50 |
| 4. | ఓటమి తిరుగుబాటు | | జ్వాలాముఖి | 2-75 |
| 5. | మండుతున్న తరం | | నిఖిలేశ్వర్ | 2-00 |
| 6. | ఊరుమ్మడి బతుకులు | కథలు | సి. యస్. రావు | 3-25 |
| 7. | సూరీడు | పాటలు | సుగంబాబు | 1-00 |
| 8. | అ.ర.సం. కాయకల్పచికిత్స | | కె. వి. రమణారెడ్డి | 1-25 |
| 9. | మహోదయం | బుర్రకథ | కానూరి వెంకటేశ్వర్రావు | 1-00 |
| 10. | సమరం | | సంకలనకర్త అగ్నిమిత్ర | 1-00 |
| 11. | కవిత్వం - చైతన్యం | | త్రిపురనేని మధుసూదనరావు | 1-50 |
| 12. | ఎర్ర పిడికిలి | | కె. వి. రమణారెడ్డి | 3-00 |
| 13. | విప్లవం వర్ధిల్లాలి | | విరసం, తిరుపతి | 2-00 |
| 14. | నాకుటుంబం | నవల | టావ్‌చెంగ్ | 2-00 |
| 15. | తెలంగాణ పోరాటపాటలు | | | 1-00 |
| 16. | జనసేన పాటలు | | జనసేన | 1-00 |
| 17. | గెరిల్లా | విప్లవగీతాలు | | 1-00 |

# విప్లవాభివాదం

కామ్రేడ్స్

మీరు చరిత్ర రచిస్తూంటే
మేం చదువుకుంటున్నాము
నలుగురకూ వినిపిస్తున్నాం
మీరు అగ్నిని రగుల్చుతూంటే
మేం [illegible]ని చూస్తున్నాం

లక్షల సైనికుల
కళ్ళల్ల కారం జల్లి, మీరు
తుపాకితో రెడ్‌బుక్‌తో
పల్లెలలో జనాలలో
దళాలుగా సంచరిస్తు
ఉద్యమాలు నడుపుతుంటె
ఉత్తేజితులవుతున్నాం

ప్రాణాలూ,
శారీరక క్లేశాలూ
వచ్చేపోయేవేనని
ఎక్కువగా విలువియ్యక
విప్లవోద్యమాభివృద్ధి
ఒకటే ఒకచూపుగా

తిరుగుతున్న కామ్రేడ్స్
మీకివె మా వందనాలు

మీ కదలిక, ప్రతిచర్యా
చరిత్రను రచిస్తోంది
మీ త్యాగం ప్రతిఒకటి
ప్రపంచాన్ని నడుపుతోంది
మీలో మీరు జరుపుతున్న
సమావేశ మొకటొకటీ
దేశాన్నురికించుతోంది

మీ అడుగుల జాడలను
మీ జ్వాలల కాంతులనూ
ప్రజలకనువదించుతూనె
మీ వెనకనె పయనించగ
తప్పులతో, తప్పటడుగు
లేస్తూనే నేర్చుతున్న
విప్లవ రచయితలం
మేడే నాడందించే
రక్తారుణ అభివాదం.

— ఎ. ఆర్.

SRJANA Telugu Monthly May '73 H-1088
Regd. No with Registrar of News Papers of India 10953/67